# చింతామణి.

లేక లీలాశుక

గ్రంథకర్తలు:

## రామనారాయణ కవులు





మూడవకూర్పు : 1000

ప్రకటనకర్త :

బెజవాడ, శ్రీసీతారామాంజనేయ కంపెనీ ప్రొప్రయిటరు,

## పోలిశెట్టి రామయ్య.



బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల, (లిమిటెడ్) యందు

క. కోదండరామయ్యచే ముద్రింపబడియె.

 1922 [వెల 1—0—0

# ఈ నాటకరాజమున ప్రదర్శింపఁబడుపాత్రలు.

## పురుషులు.

బిల్వమంగళుఁడు—కథానాయకుడు

రామశాస్త్రి—బిల్వమంగళుని మిత్రుఁడు

వాసుదేవమూర్తి—బిల్వమంగళుని తండ్రి

మధుసూదనుఁడు—చింతామణియొక్క విటుఁడు బిల్వమంగళుని దూత

సుబ్బిశెట్టి—విటుఁడు

శరభలింగము—విటుఁడు

గఫార్ సాహెబు—విటుఁడు

శ్రీకృష్ణుఁడు—అవతారపురుషుఁడు

సోమగిరియోగి—బిల్వమంగళుని గురువు

## స్త్రీలు.

రాధ—బిల్వమంగళుని భార్య

వాసంతిక—రాధయొక్క చెలికత్తె

చింతామణి—వేశ్య

సుబ్బలక్ష్మి—దాసి

శ్రీహరి—చింతామణి తల్లి



# చింతామణి.

లేక

## లీలాశుక

## ప్రథమాంకము.

---

రంగము:—[వాసుదేవునిగృహము:—ప్రవేశము.

రాధయుఁ జెలికత్తెయగు వాసంతికయు]

వాసం—అమ్మా! రాధా! నీ వెప్పుడుచూచినను నేటో సద్గ్రంథకాలక్షేపమునే చేయుచుందువుగదా!

రాధ—వాసంతికా! గ్రంథావలోకన మెంతయుపకారమునైనఁ జేయగలదు.

వాసం—ఇన్ని దినములనుండియు నీవనేకగ్రంథములఁ జూచుచుంటివి కదా! వానియందు స్త్రీలవిషయమై యేమివిశేషము చెప్పఁబడియున్నది?

రాధ—ఇదియా నీవెఱుఁగఁ దలఁచినది?

తే. గీ. పతిపదాంబుజసేవయే ♦ సతికి, సకల
సౌఖ్యములఁ గూర్చు, నదియె య♦శంబుఁ దెచ్చు
మోక్షమిచ్చుననుచు గ్రంథ ♦ ము లిలఁజాటు
చున్న వింతకంటెను నేమి ♦ చూడవలయు.

వేయేల!

సీ. సహధర్మచారిణీ ♦ సద్వ్రతంబున కెన్న
నాత్మనాథుని పూజ ♦ యాలవాల
మతిపాప సముదయా ♦ రణ్యంబుఁ జెక్కంగఁ
గోమలాంగుని భక్తి ♦ కులిశధార
సంసారనామక ♦ సాగరంబుఁ దరింపఁ
జిత్తేశు సత్పాద ♦ సేవ, నావ
యంచితానంద సా ♦ ఖ్యములిచ్చు ముక్తికిఁ
బ్రాణకాంతుభజన ♦ రాచబాట
తే. గీ. విమలభాగ్య భోగములతో ♦ వెలయఁజేయు
రమణుపద కమలార్చన ♦ యమరతరువు
సకలదిక్కుల యందును ♦ సద్యశంబు
దండిగాఁ జాటఁ బతిసేవ ♦ డిండిమంబు.

వాసం—ఇది యంతయు బాగుగనేయున్నది. కాని స్త్రీలు చదువఁ గూడదని కొందఱు పలుకుదురే? స్త్రీవిద్యవలన ననర్థకము లున్నవని కొంద ఱందురు.

రాధ—అది కేవలము వెఱ్ఱితనము. పురుషులకెట్లో స్త్రీలకుఁగూడ విద్యవలన ననేక లాభంబు లున్నవి. స్త్రీలయొక్క యజ్ఞానంబు వలనఁగూడ గొంతవఱకు దేశము పాడయిపోవుచున్నదని చెప్ప వచ్చును. చూడుము: ఒక్కొక్క స్త్రీ,

సీ. మగని దారిద్ర్యంబు ♦ మదిలోన నెంచక
యిదియది తెమ్మంచు ♦ నెప్పుడడుగు
పొరుగిండ్లలోనున్న ♦ పూబోండ్ల నీక్షించి
విభుని నగలకునై ♦ వేఁచుచుండు
నాత్మేశుఁడింటికి ♦ నరుదెంచు వేళకు
ముక్కుచు మూల్గుచు ♦ మూలఁబండు

కొఱతయించుక యొనఁ ♦ గూడినఁ భర్తపై
బహుకోపమున మండి ♦ పడుచునుండు

తే. గీ. కారణము లేకయున్న, నే ♦ కారణంబొ
తెలిపి మగనిని నెప్పుడు ♦ చెప్పుచుండు
మారుబల్కినఁ బొరుగింటి ♦ వారుచూడఁ
గొంపమునిఁగిన చందాన ♦ గోలఁబెట్టు.

ఇట్టి వనితలు పెక్కండ్రుగలరు. దీనికిఁ గారణము వివేక శూన్యమే. విద్యవలన వివేక మొదవును. ఆ వివేకమువల ననే పతిపదాంబుజసేవయందు నిశ్చలత్వముఁ గలుగును. దానం జేసి యిహపరసౌఖ్యము చేకూరును.

వాసం—పురుషులలో మాత్రి మందఱును మంచివారే యున్నారా? ఒక్కొక్క పురుషుఁడు, తన సతివిషయమై యనేకరీతులఁ బ్రవర్తించుచుండుట నేను గన్నులార వీక్షించియుంటిని.

సీ. దిక్కుమాలినదాన ♦ వెక్కడనాకును
దొరకి నావంచును ♦ దూరుచుండు
వేళమించెను తిండి ♦ బెట్టకపెత్తనం
బులకేగితే యంచుఁ ♦ బలుకుచుండు
నేదైనఁ గోరిన ♦ నే నెపముననైన,
సాకుఁజేసికొనుచుఁ ♦ జానగొట్టు
చీరెలు రవికెలు ♦ సారెసారెకు నెన్నొ
దెమ్మందు వంచును ♦ దిట్టుచుండు

తే. గీ. ఎంత పెట్టినఁగాని యొ ♦ క్కింతయైన
తుష్టిలేని దానవనుచుఁ ♦ దూలనాడు
నట్టిపురుషులు లేరొకో ♦ యవనియందు
స్త్రీలయందును మాత్రమే ♦ చెప్పితేల.

పరవనితల మఱఁగి భార్యల నేడిపించువా రెంతమందికలరు?

వేయేల!

సీ. సహధర్మచారిణీ ♦ సద్వ్రతంబున కెన్న
నాత్మనాథుని పూజ ♦ యాలవాల
మతిపాప సముదయా ♦ రణ్యంబుఁ జెక్కంగఁ
గోమలాంగుని భక్తి ♦ కులిశధార
సంసారనామక ♦ సాగరంబుఁ దరింపఁ
జిత్తేశు సత్పాద ♦ సేవ, నావ
యంచితానంద సౌ ♦ ఖ్యములిచ్చు ముక్తికిఁ
బ్రాణకాంతుభజన ♦ రాచబాట

తే. గీ. విమలభాగ్య భోగములతో ♦ వెలయఁజేయు
రమణుపద కమలార్చన ♦ యమరతరువు
సకలదిక్కుల యందును ♦ సద్యశంబు
దండిగాఁ జాటఁ బతిసేవ ♦ డిండిమంబు.

వాసం—ఇది యంతయు బాగుగనేయున్నది. కాని స్త్రీలు చదువఁ గూడదని కొందఱు పలుకుదురే? స్త్రీవిద్యవలన ననర్థకము లున్నవని కొంద ఱందురు.

రాధ.—అది కేవలము వెఱ్ఱితనము. పురుషులకెట్లో స్త్రీలకుఁగూడ విద్యవలన ననేక లాభంబు లున్నవి. స్త్రీలయొక్క యజ్ఞానంబు వలనఁగూడ గొంతవఱకు దేశము పాడయిపోవుచున్నదని చెప్ప వచ్చును. చూడుము: ఒక్కొక్క స్త్రీ,

సీ. మగని దారిద్ర్యంబు ♦ మదిలోన నెంచక
యిదియది తెమ్మంచు ♦ నెప్పుడడుగు
పొరుగిండ్లలోనున్న ♦ పూబోండ్ల నీక్షించి
విభుని నగలకునై ♦ వేఁచుచుండు
నాత్మేశుఁడింటికి ♦ నరుదెంచు వేళకు
ముక్కుచు మూల్గుచు ♦ మూలఁబండు

కొఱఁతయించుక యైనఁ ♦ గూడినఁ భర్తపై
బహుకోపమున మండి ♦ పడుచునుండు

తే. గీ. కారణము లేక యున్న, నే ♦ కారణంబొ
తెలిసి మగనిని నెప్పుడు ♦ దెప్పుచుండు
మాఱుబల్కినఁ బొరుగింటి ♦ వారు చూడఁ
గొంపమునిఁగిన చందాన ♦ గోలఁబెట్టు.

ఇట్టి వనితలు పెక్కండ్రుగలరు. దీనికిఁ గారణము వివేక
శూన్యమే. విద్యవలన వివేక మొదవును. ఆ వివేకమువల
ననే పతిపదాంబుజసేవయందు నిశ్చలత్వముఁ గలుగును. దానం
జేసి యిహపరసౌఖ్యము చేకూరును.

వాసం——పురుషులలో మాత్రి మందఱును మంచివారే యున్నారా?
ఒక్కొక్కపురుషుఁడు, తన సతివిషయమై యనేకరీతులఁ బ్రవ
ర్తించుచుండుట నేను గన్నులార వీక్షించియుంటిని.

సీ. దిక్కుమాలినదాన ♦ వెక్కడిదానను
దొంగకి నావంచును ♦ దూఱుచుండు
వేళమించెను తిండి ♦ బెట్టుమని చెప్పినం
బలకేగితే యంచుఁ ♦ బలుకుచుండు
నేడైనఁ గోరిన ♦ నే నెసమునన్నైన,
సాకుఁ జేసికొనుచుఁ ♦ జానగొట్టు
చీరెలు రవికెలు ♦ సారెసారెకు నన్నె
దెమ్మందు నంచును ♦ దిట్టుచుండు

తే. గీ. ఎంత పెట్టినఁగాని యి ♦ క్కింత యైన
తుష్టిలేని దానవనుచుఁ ♦ దూలనాడు
నట్టిపురుషులు లేరొకో ♦ యవనియందు
స్త్రీలయందును మాత్రమే ♦ చెప్పనేల.

పరవనితల మఱఁగి భార్యల నేడిపించువారెంతమందికలరు?

రాధ—వాసంతికా! నీవు చెప్పినట్లు పురుషులలోఁగూడ నున్నారు. ప్రస్తుతవిషయము పాతివ్రత్యసంబంధమైనదగుటచే నదియే చెప్పితిని. నీ వేవో వెఱ్ఱిప్రశ్న లడుగుచుందువు. వినుము!

క. ముసలి దరిద్రుఁడైన నప ♦ మార్గచరుండయినన్, నిజాంగనన్
బోషకుఁడైనవాఁడైయునను, న ♦ ధీరుఁడైయునను, హీనుఁడైన, గూ
ణగుణము లేనివాఁడయిన, ♦ వారసతీరతుఁడౌచు నున్నచోఁ
మగువల కెప్పుడుఁ బతియె ♦ మానము ప్రాణముదైవముఁ జుమీ.

(బిల్వమంగళుఁడు ప్రవేశించును.)

బిల్వ—(త్వరగాఁబ్రవేశించి) ఏదేది! నీవు చదివినపద్యము మఱొక్కసారి చదువుము.

రాధ—(లేచి) నాథా! దయచేయుము. (అని పూర్వోక్తపద్యమును జదువుచున్నది).

బిల్వ—తరుణీమణీ! ఈగుణము స్త్రీలయందందఱకును నుండవలయును గదా!

రాధ—అట్లున్న కాంతయే సాధ్వి యనంబడును.

బిల్వ—(తనలో)

మ. పరమాత్ముం డఖిలప్రపంచమయుఁడై ♦ భాసిల్లుచున్ వేడ్క దు
ష్కరదుర్దాంతదురంతదుస్సహమహా ♦ గ్రక్రూర భీభత్ససం
సరణంబందున భార్యయంచు నొక య ♦ జ్ఞాత్మికన్ సృజించెన్ భళా
పురుషుం డెంతయు సంతసించుచును స ♦ మ్మోహాబ్ధి నోలాడఁగన్.

భార్యయనునది లేకపోయినచో సంసారమే లేదుకదా! సంసారకూపంబునంబడక, సర్వసంగపరిత్యాగము జేసి, కాననంబుల యందుఁజేరి పరమేశ్వరునిఁగూర్చి యఖండతపము సేయుట మంచిదని కొందఱు నుడువుదురు. అదియు నొక విధముగ మంచిదే! కాని సంసారమునందు గొంత సౌఖ్యమనుభవించిన పిదపనట్లొనర్చినచో బాగుగానుండును. లేకపోయిన భోగవాంఛవృద్ధికి

మార్గ ముండదు. (ప్రకాశముగా) రమణీ! సద్గుణపేటివగు నీవు నాకు భార్యవగుటంజేసి నేనెంతయుఁ గర్వించుచున్నాను.

రాధ—నాథా! మీ సేవకురాలనగు నన్ను శ్లాఘించెదరేల?

మ. ధనముంగల్గిన విద్య సున్నయగు గా ♦ దా! రెండునుం గల్గినన్
గనఁగాఁజాలము రూప మద్దియును గ ♦ ల్గన్ జ్ఞానమున్ శీలస్యమా
ననఘా! యిన్నియు నీయెడన్ గలిగెఁ బు ♦ ణ్యం బెంతయో మున్ను జే
సినదానన్ గనుకన్ నినున్ బడసితిన్ ♦ జిత్తేశుఁగా ధారుణిన్.

ఇంక నా కేకొఱంతయు లేదు. మీ పాదసేవఁ జేసికొనుచుఁ గృతార్థురాల నయ్యెదఁగాక!

ఉ. మామకభాగధేయగరి ♦ మంబున నాపతివై చెలంగి తో
భూమిసురాన్వయాబ్ధిపరి ♦ పూర్ణసుధాకర! బంధులందు, స
త్స్వామిత వైభవంబు గని ♦ తద్దయు సౌఖ్యములందుచుంటి నీ
వీ మహిఁజూపు సత్కృపకు ♦ నెంతయు సంతసమందితిన్ మదిన్.

బిల్వ—సఖీమణీ! ఇదియంతయు భగవత్సంఘటనము. ఇందు నీ నా విశేష మేమియును లేదు.

రాధ—మనోహరా! ఎట్లయినను నాతను వృస్నంతవఱకు మీ పాదసేవఁ జేయుచు నెడబాటు గనకుండ వెళ్లిపోవుటయే కావలసినది. నిరంతరము నీసత్కృపావర్షము నాపైఁ గురిపించుచు నుండు టయే నాకు మహానందము.

బిల్వ—తరుణీ! ఇప్పటి కేకొఱంతయు లేదుకదా! ఇఁక ముందుసంగతి యెట్లు చెప్పఁగలము?

రాధ—అట్లు వచించితిరేమి?

బిల్వ—మఱేమియు లేదు. భగవంతుని చర్య లనంతములు.

మ. ధనికున్ బేదగఁ బేదనున్ ధనికుఁగా ♦ ధర్మైకసంవేద్యు దు
ర్జనుఁగా దుర్జను ధర్మతత్పరునిఁగా ♦ శౌర్యాన్వితున్ భీరుఁగా

ఘనకీర్తిప్రదుఁ గీర్తిహీనుఁగఁ గడుఁ ♦ గావింపఁగాఁ జాలు దే
వునిలీలల్ గన నేరికైనఁదరమే ♦ పూర్ణేందుబింబాననా.

(ఇంచుక యూరకుండి) ఏదో ప్రశంసఁబెట్టుకొని నీచదువుఁ జెడఁ
గొట్టితిని. పాపము! వాసంతిక కేదో బోధ సలుపుచుంటివి కాబోలు.

రాధ—పతివ్రతాత్వమునుగూర్చి ప్రశ్నించినది.

బిల్వ—నీచేతనున్నది భారతమేనా?

రాధ—అవును.

బిల్వ—నీవిప్పు డే ఘట్టముఁ జదువుచుంటివి?

రాధ—సత్యభామకు ద్రౌపది పతివ్రతాధర్మములు చెప్పుట.

బిల్వ—ఎంతవఱకుఁ జదివితివి?

రాధ—

" చం. పతిగడవంగ దైవతము ♦ భామలకెందును లేదు ప్రీతుఁడై
పతి గరుణించెనేనిఁ గల ♦ భాషిణి భాసుర భూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము ♦ విశ్రుతసంతతియుఁ యశంబు స
ద్గతియును గల్గు నోంపుమెయిఁ ♦ గల్గునె యిన్ని తెఱంగులారయఁ."

(రామశాస్త్రి ప్రవేశించును.)

రామ—సాధ్వీమణీ! రాధా! ఆపద్యము నింకొకసారి చదువుతల్లీ! వ్రాసి
కొనిపోయి నాభార్యకైన వినిపించెదను. బుద్ధి వచ్చునేమో!

బిల్వ—మిత్రమా! రామశాస్త్రీ! వచ్చితివా? ఇంతవఱకును నీవెందుకు
రాలేదని తలంచుచుంటిని.

రామ—ఏమి చేయుమందువు? దిక్కుమాలిన సంసారబాధ! ఈకూప
ములోఁబడి లేవలేక యున్నాను.

బిల్వ—రామశాస్త్రీ! సంసారబాధ యందఱకు నున్నదే! నీకు
మాత్రమే కాదు.

రామ—నాకున్నబాధ యెవరికిని లేదు. తెల్లవారి లేచినదిమొదలు ఒకటే
పోరు.

బిల్వ—ఎవరితో?
రామ—ఇంకెవరితో! చేసికొన్నదానితో!
బిల్వ—అగ్నిహోత్రునిసాక్షిగాఁ గొన్న భార్యతోడనా, నీవు కలహించుచుంటివి. చాలుఁ జాలు. ఎవరైన విన్న నవ్వెదరు.
రామ—మిత్రమా! నీవు సంగతిసందర్భములు దెలియకుండ మాటలాడెదవు. నేను దానితోఁ బోరాడుటలేదు. అదియే నాతోఁ బోరాడుచున్నది. బొత్తిగా నాకంపంటేనే గిట్టదు. నామొగముఁ జూడఁగానే మటమట మండిపడును. అనుదినమును చీరెలు రవికెలు గావలయునన్నచో నెక్కడనుండివచ్చును? అక్కడికి నాకు బ్రాహ్మణార్థములలో దొరికిన యంగవస్త్రములు మొదలగునవి విక్రయించి దానికి గావలసినవన్నియు యదాన్ని పెట్టుచునేయుందును. ఎంతకును సంతృప్తిలేనిముండ.
బిల్వ—తిట్టకు. తిట్టకు.
రామ—ఏమి! తిట్టకు. ఏమిటో జిహ్వాచాపల్యముకదా. నిన్నటిరోజున మాయావిడకు శ్రావణమంగళవారపుబాపతు శెనగలు దొరకగా వానిని సాతాళించి పెట్టుమనుసరికి, నెక్కడలేని కోపమువచ్చి యెన్నియొ చెప్పలుచెప్పి, యిరుగుపొరుగుననున్న యమ్మలక్కల నందఱను జేర్చి తుదకు నాపొడుముకుండఁగూడ బ్రద్దలుకొట్టినది.
బిల్వ—నీకుఁ జాలనష్టము సంభవించినదే!
రామ—నష్టమనగా నష్టమా! నా ముక్కూడిపోయినట్లున్నది.
బిల్వ—పోనిమ్ము. ఇంతకును శెనగలుతింటివా?
రామ—అవితింటే యింకనేం? ఎన్నితిట్లయిన నొకగారెముక్కతో సమానము గావన్నారు. ఏదెల్లా గంగలోగలిస్తే నాకెందుకు? "కృష్ణా! రామా! గోవిందా!" అనుకుంటూపున్నంత సుఖ మింకొకటిలేదు (ఇంచుక యూరకుండి) మఱచిపోయితిని. నేఁడొకచోట తద్దినపు బ్రాహ్మణార్థ మున్నది. ఈరోజున నిదియున్నదని నిన్న భోజనముఁగూడ చేయలేదు.

రాధ—(నవ్వును)

రామ—అమ్మాయీ! నవ్వెదవేమి! నే నన్నదానిలో లోప మేమియును లేదు. ఇటువంటి కార్యములపట్ల బ్రాహ్మణులు సంపూర్తిగా భోజనముఁ జేసినఁగాని పితృదేవతలు సంతోషించరట. అందుచేత నేను నిన్ను భుజింపకయుంటిని. ఆవంతుఁగూడ నేఁడుఁ [illegible].

బిల్వ—నీవు వచ్చినన్న కాలక్షేపమగుట కేమియు సందియము లేదు.

(తెరలో)

అబ్బాయీ! బిల్వమంగళా!

బిల్వ—ఓహో! తండ్రిగారు వచ్చుచున్నారు.

రాధ—మామగారు వచ్చుచున్నారు. మేము లోపలికేగెదము.

(వాసంతికతో నిష్క్రమించును.)

(వాసుదేవుఁడు ప్రవేశము)

బిల్వ—(తండ్రినిఁజూచి లేచి) తండ్రీ! ఇటురమ్ము.

వాసు—తండ్రీ!

బిల్వ—ఈయాసనముమీదఁ గూర్చుండుము.

వాసు—(ఆసీనుఁడై) ఈతఁ డెవరు?

బిల్వ—నా స్నేహితుఁడు రామశాస్త్రి.

వాసు—అట్లనా! (రామశాస్త్రినిఁజూచి) నాయనా. రామశాస్త్రీ! కుశలముగ నుంటివా?

రామ—మీదయవలన, దర్భపోట్లు దొరుకుచున్నంతవఱకు నాకు కుశలమునకేమియుఁ గొఱంత కలుగదు.

బిల్వ—మిత్రమా! అందఱియొద్దను నొక్కతీరుగనే మాటలాడుదువు కదా!

వాసు—పోనిమ్ము. ఆతనితోనేమి! చమత్కారవచనప్రియుఁడు. (ఇంచుకయూరకుండి) కుమారా! నీతోఁ గొన్నివిషయములు మాటాడఁ దలంచితిని.

రామ—తండ్రికొడుకుల రహస్యముకాబోలు, నేనావలకుఁ బోవుదునా?

వాసు—రామశాస్త్రీ! నీవు మాకుఁ బరుడవుకావు. (బిల్వమంగళుని జూచి)

బిల్వ—తండ్రీ! ఏమి సెలవు?

వాసు—వత్సా!

మ. తొలిజన్మంబున నేనుజేయు సుకృత ♦ స్తోమంబునం జేసి, పు
త్రుఁడవై బుట్టితి వీవు నాకు గడుసం ♦ తోషంబుఁ జేకూరె; ని
ర్మలకళ్యాణగుణాఢ్యయైన సతియుం ♦ భాగ్యంబునం జేసి నీ
కులభించెన్ గొఱతెంను లేదు గదరా ♦ కుమారా! సువిద్యానిధీ.

నాగర్భంబున జన్మించినందుకు సమస్తవిద్యావిశారదుండవైతివి. ఒరులంజేరి యాశ్రయించు నవసరములేకుండ మనకుఁ గావలసినంత ధన మున్నది. నీ విద్యాబుద్ధులు, నీ యశము, మొదలగునవి చూచి యానందించుభాగ్యము నీతల్లికిమాత్రము లేకపోయినది. విధిసంకల్ప మట్లున్నది. దానికిప్పుడు వగవం బనిలేదు. నేను వృద్ధుఁడనైతిని. ఈకార్యభారము నేను వహింపఁజాలను. ఇంక నియ్యదియంతయు నీకప్పగించి నేను భగవచ్ఛరణచింతనంబున సుఖముగాఁ గాలముఁ గడపెదను.

ఉ. ఏనిఁక విశ్రమింపఁగను ♦ నెంచితి; నీవిక నిర్విచార భా
వాను గతుండవై పరమ ♦ హర్షమెసంగ సమస్తవస్తుక
శ్రీ నిరవొందుచున్ విబుధ ♦ సేవ ననారత మాచరించుచున్
మానితకీర్తిఁ గైకొనుము ♦ మాన్యచరిత్ర కుమార శేఖరా.

నేఁడెంతయు సుదినము. భోజనానంతరమున వ్యవహారసంబంధమైన కాగితములు మొదలగునవియు, ద్రవ్యమును నీవశముఁజేసి, చెప్పవలసిన సంగతులన్నియుఁ జెప్పెదను.

బిల్వ—తండ్రీ! నీయాజ్ఞకు బద్ధుఁడను. (ఇంచుక యూరకుండి) భోజనమునకు వేళయైనది. నీవు స్నానము సేయుచుండుము. నే నీతనిఁ బంపివచ్చెదను.

వాసు—మంచిది. (నిష్క్రమించును)

బిల్వ—మిత్రమా! మనము మరల గలిసికొందుమా!

రామ—నేను భోజనమునకు మీయింట నుందునేమోనని బెంగపడకుము.

బిల్వ—శాస్త్రీ! నీమాటల కేమి!

రామ—సరేగాని, ఇంతవఱకును నీవు తండ్రిచాటున నున్నవాఁడవగుటచే, మనమైత్రి కేవిధమయిన లోటును గలుగకయున్నది ఇప్పుడు కార్యభారమంతయు నీపైఁ బడుచున్నది. అధికారివై నన్ను మఱచిపోయెదవేమోసుమీ!

బిల్వ—అట్లెన్నటికినిఁ దలంపకుము. పోయిరమ్ము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

---




## ద్వితీయాంకము.

---

(చింతామణిగృహముముందు మధుసూదనుఁడు ప్రవేశము).

మధు—(తనలో) అబ్బా! తిరిగితిరిగి విసుగుపుట్టినది. ఎక్కడను ఋణము దొఱకలేదే. ఈయూర పెద్దషావుకారగు బాపనయ్య దగ్గఱకుఁ బోయితిని. ఆతఁడు ప్రస్తుతము తనయొద్ద దస్తు లేదని చెప్పినాఁడు. తరువాత యెంతసొమ్ము కావలసిన నంత యిచ్చు చుండుమార్వాడీవర్తకుల నందఱను నడిగితిని. ఎవ్వరును నీయరైరి. (ఆలోచించి) అవును, నాయాస్తియంతయు విక్రయించివేసితినని యందఱకును దెలిసినది. అట్టిచో నెవఁడిచ్చును. ఇప్పుడు నేనేమి సేయుదును? ఎక్కడనైనను ధనము దొఱకు వఱకును జింతామణిగృహంబున కరుగకుండ నుండఁదలంచి నచో నందులకుఁ జిత్తము సమ్మతింపదు. వేశ్యావ్యామోహ యంత్రమున నేమియాకర్షణశక్తియున్నదో భగవంతునకే తెలియవలయును. ఒక్కనిముషమైనను నే నీచింతామణిని విడిచి యుండఁజాలను. దానిని ముద్దుగొననిదినము నాకుదుర్దినమే.

తే. గీ. ఖండశర్కరకంటె, ద్రా ♦ క్షారసంబు
కంటె, మధువుకంటెను తీపి ♦ గలది యగుచు
బొలుచు చింతామణీకాంత ♦ ముద్దు పర్ణ
సంబు సేయఁ గవులకు శ ♦ క్యంబుగాదు.

నే ననేకమందివారకాంతలనుఁ జూచితినిఁ గాని దీనింబోలుదానినెందును జూడలేదు.

తే. గీ. పుడమియందు సంసారిగాఁ ♦ బుట్టఁజేయ
దలచి యవ్విధాత మరల ♦ దాని మఱచి
యిట్లు వేశ్యగాఁ బుట్టించె ♦ నింతి నకట
కాకయున్న నీగుణములు ♦ గలుగనగునె.

తక్కినగణికలకునుఁ జింతామణికిని మిగుల భేదమున్నది. దీనికి ద్రవ్యాశయే లేదు. అనురాగమే ప్రధానము. కాని, దీని తల్లి ప్రోద్బలముచేత నడుగక తప్పదయ్యెను. ఎందఱో రాజాధిరాజుల వంటి వారు దీనికి వార్తలఁ బంపినను, నాపైనున్న మోహముచేత వారినెల్లరఁ దృణప్రాయముగఁ జూచినది. నేనొక్కనిమిష మాలస్యముగాఁ బోయి తినేని నాకై యెంతయో బెంగపెట్టుకొనుచుండునని సుబ్బలక్ష్మి చెప్పినది. దానితల్లిబలవంతముచేతనే యిది డబ్బుకోసము నన్నింత తొందర పెట్టుచున్నది. కాకపోయినచో, నేనాఁడైనఁ జింతామణి యింత ధనముగా నన్నడిగినదా? (ఇంచుక యూరకుండి) ఇంక నేను లోపలి కేగెదను. అడుగు పెట్టగానే యాముసలిముండ కాట్లకుక్కలాగున మీఁదఁబడును. కాని, నేటికేదో తగిన సమాధానముచెప్పి తప్పించుకొందును. నేను వ్యాపారిబిడ్డనుగదా! అదిగో సుబ్బలక్ష్మి.

(సుబ్బలక్ష్మిప్రవేశము.)

సుబ్బ—(మధుసూదనునిఁ జూచి) ఇదిగో! బావయ్యగారు నిండా ఆలోచిస్తూ యిక్కడ నిలుచుండారే?

మధు—ఏం బావయ్యగారు.

సుబ్బ—ఏమల్లా అంటున్నారు. ఈయాలకూడా తడి దొరకలేదా యేంటి? మాపెద్దమ్మ మండిపోతూవుండది.

మధు—సరేలే. నేను నెమ్మదిగా లోనికేగి శయనగృహములోఁ గూర్చుండెదను. నేను వచ్చితినని చింతామణితోఁ జెప్పుము.

(లోపలఁ బ్రవేశించి కూర్చుండును.)

మధు—(తనలో ఈవేశ్యమాతకు నేను భయమందవలసి వచ్చినదే. పాపము! నామూలమునఁ జింతామణికిఁగూడ జీవాట్లు వచ్చుచున్నవి.

తే. గీ. అరయ నధికార్లభవనంబు ♦ లందు, ముందు
గాపలాయుండెడి భటుల ♦ కరణి; వార
సతుల యిండ్లలోఁ గుక్కల ♦ సరణి విటుల
పైనఁబడగనుందురు వృద్ధ ♦ వనిత లహహ.

నేను వచ్చినజాడ యింకను దెలియలేదు. లేకపోయిన నీసరికే శునకము మొఱిగిన ట్లఱచుచు వచ్చియుండెడిదే.

(చింతామణి ప్రవేశించును.)

చింతా—(మధుసూదనునిఁ జూచి) నిశ్శబ్దముగా వచ్చికూర్చుండిన నీతనింజూడ నాకెంతయు జాలియగుచున్నది. ఇప్పు డీతని ముఖము భయమునకు నిలయమైయున్నది.

తే. గీ. వేశ్యమాత లెటుఁజూచిన ♦ విత్తమేది
యనుచు నడుగుదురంచు భ ♦ యంబుఁ బూని
కన్నమును వేయవచ్చు త ♦ స్కరునిపగిదిఁ
జొచ్చెదరు విటులు గణికా ♦ సుదతి గృహము.

ధనముకై వేశ్యలు విటకాండ్రయొద్ద నెన్ని ప్రియవాక్యములు పలుకుచుందురో, యట్లే విటులలో గొందఱు వేశ్యలయొద్ద నా

సమయమునకు దాటిపోవుట కనేకపలుకులుఁ బలుకుచుందురు. ఈ వ్యభిచారమే జీవనముగాఁ గల్పించి యీవేశ్యకులంబును భగవంతుఁ డేలసృష్టించెనో కదా! ఛీ! ఏమిబ్రతుకు!

తే. గీ. ధనమొసంగినవాఁడె పో ♦ ధవుఁడటంచు
వానితోడనుఁగూడుచుఁ ♦ బఱగవలయు
విటులహృదయముల్ రంజించి ♦ వెలుగవలయు
నకట! కడుపాప మీవెల ♦ యాలివృత్తి.

బాల్యమున నాకీవృత్తి వలదని యెంతబ్రతిమాలుకొన్నను వినక నాతల్లి యిందులో దింపినది. ఇప్పుడు నేనెంతవిచారించినను నేమి ప్రయోజనమున్నది? ఇదివఱ కనేకకొంపలు నావలన మాపఁబడినవి. ఇంకెన్ని మాపవలసి యున్నానో తెలియదు. (మధుసూదనుని జూచి) ఇదిగో! పంతులుగారు వచ్చి యెంతసేపయినది? నేను చూడనేలేదు.

మధు — ఇప్పుడు నేను నీకుఁ గనుపించుచున్నట్లున్నాను? నేను నీకుఁ గనబడు రోజులు పోయినవి.

చింతా — మీరేమనినను సరే. మీకు నేను ప్రత్యుత్తర మీయలేను. నేను తక్కినవేశ్యకాంతలతోపాటిదాననో కానో మీయంత రంగమునకే తెలియును. నాయనురాగ మెట్టిదో మీకుఁ దెలియదా? చులకనగా మాటమాత్రము జారనిచ్చినారు.

మధు — చింతామణీ! పరిహాసమున కాడినమాటను పాటించెదవేల? చాలుచాలు సరసము. నాహృదయము నీవెఱుంగవా?

మ. వెలయాండ్రన్ బదివేలమందిని భువిన్ ♦ వీక్షించి యున్నాను గా
ని లతాంగీ! నినుఁబోలునట్టి తరుణిన్ ♦ వీక్షింపలే దెందు; ని
స్తులమోహం బదియేమికారణమొ తో ♦ డ్తో జూడఁగాఁ గల్గె నీ
యెడ నెంతైనఁ దదాదిగానెపుడు ని ♦ న్నే నమ్మియుంటిన్ గదా.

చింతా—(తనలో) ఈతఁడు నన్ను నమ్మియున్నాఁడేమో గాని నేను మాత్ర మీతనిని నమ్మియుండలేదు గదా!

మధు—చింతామణీ!

తే. గీ. భవ్యభవదీయ వినయంబు ♦ భక్తి; ప్రేమ
వలపుఁగలిగించుచుండు, మా ♦ టల పసందు
వారసతులందు నున్నయే ♦ నారికైనఁ
గలవె నీకు నీవేసాటి ♦ కలికిమిన్న.

చింతా—(తనలో)

తే. గీ. అల కిరాతుఁడు పన్నిన ♦ వలనుఁజిక్కి-
కదలలేక యుండిన కురం ♦ గంబు పగిది
నాదు మోహంపు టురులలో ♦ నఁదగులుకొని
నన్ను బాయఁగా జాలక ♦ యున్నవాఁడు.

కానిమ్ము. ఇఁక నెన్నిదినము లుండును. అనుదినమును నీతనికి స్వస్తివాక్యముఁ జెప్పుమని నాతల్లి నాతోఁ బోరాడుచునే యున్నది. ఈతఁడు నాకొఱ కెంతయో ద్రవ్యము వెచ్చఁబెట్టెనుగదాయని మర్యాద నాలోచించి నేనే జెప్పకయూరకుంటిని. (ప్రకాశముగా) పంతులుగారూ! ఈవేళ నన్ను మిగుల శ్లాఘించుచున్నారు. ఎక్కడా మీరు ప్రయత్నంచేసే సొమ్ము దొరకలేదా యేమి? మీముఖము జూడఁగా నట్లేయున్నది.

మధు—త్వరలోనే యందును. కాని, సమయమునకు రానందుకు మాత్రము చింతపడుచున్నాను.

చింతా—ఎప్పటి కప్పుడే మీరిట్లు జెప్పుచున్నారు. నాయంతరంగము మీకు సంపూర్తిగాఁ దెలియును. మాయమ్మతో నేను వేగ లేక యున్నాను.

మ. మడిమాన్యంబుల నీకు నిత్తుమనుచుం ♦ బల్మారు నాయింటిముం
గల కేతెంచి; ధనాఢ్యులౌ ఘనులు వే ♦ డ్కన్నాకు నెన్నెన్నొవా

ర్తలఁ బంపించుటయైనఁ జూడక, జమీం ♦ దారున్ దృణప్రాయుఁగా
వలదంచున్ బలుకంగ లేదె విను నీ ♦ పైనున్న మోహంబునన్.

అది యట్లుంచుము.

సీ. పలికినందుకె మీఁద ♦ బంగారు గుళిపించు
పృథ్వీశమణులను ♦ విడచినాను
చేయి మీద వైచినఁ ♦ జెలఁగి కాసులనిచ్చు
వైశ్యుల బొమ్మంచు ♦ బలికినాను
నగుమోముఁ జూపిన ♦ నగ లిత్తుమనెడి వా
రి వలదని తృణీక ♦ రించినాను
ముద్దిచ్చితే జాలు ♦ ముత్యాలకోవలి
త్తుమనెడివారిని ♦ ద్రోచినాను
తే. గీ. నాకు నీమీద నున్నట్టి ♦ నన్యమోహ
మీ తెఱంగునఁ జేసె; నిం ♦ కేమిసేతు
దల్లి కోపంబు భరియించి ♦ దనరఁజాల
మార్గమేమి యూహింతువో ♦ మాన్యచరిత.
సీ. నిన్న మొన్ననె కదా ♦ పన్నె చిన్నెలమేడ
గట్టించి యిచ్చె శ్రీ ♦ కాంతరావు
మోహంబువిడలేక ♦ భూమి వ్రాసి యొసంగె
ఘనగర్కిపర్తి మొ ♦ ఖాసదారు
నిలువెల్ల నగలతో ♦ నింపివేసెను తోడి
సతుల కనులుకుట్ట ♦ చంద్రరెడ్డి
యేదికోరిన దాని ♦ నిచ్చి కోరికదీర్చె
యమలగుణుండైన ♦ యాదిశెట్టి
తే. గీ. వీరికందఱ కాకాశ ♦ వీధిఁ జూపి
స్వస్తిఁ జెప్పుటఁ జూడ నీ ♦ పైని నాకుఁ
గలిగియుండిన మోహంబె ♦ కారణంబు
గాదె; దీనినైనను నీవు ♦ గాంచవేల.

మాతల్లి ప్రోద్బలమునఁజేసి మిమ్ములను గట్టిగా నడిగినచో మీ కెక్కడ నాగ్రహ మొదవునోయని భయ మందుచుందును.

మధు—చింతామణీ! నీహృదయము నే నెరుంగుదును. నేనుమాత్రము నీయెడల గావించిన కొఱంత యేమియునులేదు.

సీ. నినుబాసినను నేను ♦ నిమిష మోర్వ ననెడి
పాపాచలంబును ♦ బాసినాను
యెచట కేగిన వెంట ♦ నే తెంచుచుండెడి
పుష్పవేణినిఁ ద్రోసి ♦ పుచ్చినాను
మీరుండినం జాలు ♦ మేలౌదవు ననెడి
శ్రీమనోహరినిఁ ద్య ♦ జించినాను
ధనమేమి వలదంచు ♦ మనసారఁ జెప్ప న
రోజముఖిని నిష్టి ♦ రోసినాను

తే. గీ. తక్కినట్టి వెలందులఁ ♦ దలఁపనేల
నాకు నీపైన గట్టిగా ♦ నాటియున్న
మోహమేగద దీనికి ♦ మూలమరయ
నిఖిల గుణమణీ! చింతామ ♦ ణీవధూటి.

చింతా—(తనలో, వీరందఱకును నీతనిమీద నిజముగాఁ బ్రేమ యున్నదనియే తలఁచుచున్నాఁడు.) చివఱకు నన్నుగూడ నా సామాన్య వెలయాండ్రలోనే చేర్చినారా! అవునవును. నేనుమాత్రి మాకులమున బుట్టలేదా?

మధు—నే నిట్లంటినని నీవు మఱొకవిధమునఁ దలపవలదు. మాట వరుస కంటిని. పోనిమ్ము. ఆసంగతి యేల!

సీ. ఉన్నంతవఱకును ♦ నొప్పుగా ద్రవ్యంబు
దెచ్చి యంతయును నీ ♦ కిచ్చినాను
మాపూర్వులుంచిన ♦ మాన్యముల్ తెగనమ్మి
వచ్చినసొమ్ము నీ ♦ కిచ్చినాను

జనకుండు గట్టిన ♦ ఘనసౌధమును నీదు
చేరెలకుఁ గ్రయంబు ♦ జేసినాను
నీయింట శుభముకై ♦ నెలత మంగళసూత్ర
మును నమ్మి యదినీకె ♦ పోసినాను
తే. గీ. వేయు నేటికి మొన్ననే ♦ వెలదిగంటె!
యలుకరోజున నాకును ♦ నత్తవారొ
సంగిన ప్రశస్తమైనట్టి ♦ యుంగరంబు
గూడ నమ్మి ధనమునీకె ♦ గూర్చినాను.

ఇది యట్లుంచుము. నల్లమందుకనిముఁ బాగాకున కనియు నడిగినప్పుడెల్ల నీతల్లికి యిచ్చినది లెక్కయేలేదుకదా! "అర్థము ప్రాణము ఆచార్యులవారి స్వాధీన" మన్నట్లు సర్వమును నీ యధీనము జేసితిని.

చింతా—(తనలో) ఈతఁడన్నమాట నిశ్చయమే. నా మాయావాగురం జిక్కి యింతధనము వెచ్చించిన యీతనిని నిలువెడల నడపుట కెట్లు చిత్తము సమ్మతించును? (ప్రకాశముగా) పంతులుగారూ! మీ రీయలేదని నే నెన్నడైన ననియుంటినా! అట్లు పలికినచో నా నాలుక వేయిచీలికలు గాదా. (ఇంచుక యూరకుండి) ఇంతకును మీకు నిశ్చయము ద్రవ్య మేరోజునకు వచ్చునో చెప్పఁగలరా!

మధు—నే నావిషయమై సకలవిధములఁ బ్రయత్నము సేయుచున్నాను. రెండు మూడు రోజులలోనే యందును. అదియునుగాక, నే నొక్క స్నేహితుని నడిగియుంటిని. ఆత డీరోజున మధ్యాహ్నము ప్రత్యుత్తరమిచ్చెదనని పలికినాఁడు.

చింతా—అట్లయిన మీరు నాయందు దయయుంచి తత్ప్రయత్నమున నుండుఁడు. జాగుసేయవలదు.

(లోపల)

అమ్మాయీ! చింతామణీ!

చింతా—అదిగో! మా యమ్మ వచ్చుచున్నది.

మధు—నేను వెళ్ళివచ్చెదను. (ఈవలకువచ్చి) ఇప్పుడీ ముసలిముండ కంటఁబడరాదు.

ఆహా! ఆ భగవంతుఁ డీ వేశ్యమాతల హృదయములు కఠినపాషాణములతో నిర్మించియుండనోపు.

తే. గీ. గౌరవంబును మర్యాదఁ ♦ గాంచకుండ
నెట్టివారిని నైనను ♦ నిట్టె గడ్డి
పోచగాఁగట్టి శునకంబు ♦ పోల్కిపైన
బడును; జూచినంతనె యెంతో ♦ భయము గలుగ
విటులపాలిఁటి యమదూత ♦ వేశ్యమాత.

వేశ్యమాతామారణమున కేమైన మంత్రముండిన బాగుండును.
(నిష్క్రమించును.)

(శ్రీహరి ప్రవేశించును.)

శ్రీహ—(చింతామణినిజూచి) ఎవరే నీతో మాట్లాడివెళ్ళువారు?

చింతా—ఇంకెవ్వరు! మధుసూదనపంతులు.

శ్రీహ—బాగానే వున్నది. ఈతని కింకా నీవు స్వస్తి చెప్పలేదుకదా!

ఇట్లున్నచో మన బ్రతుకు తెల్లవారినట్లే. ఇంతవిద్య నభ్యసించిన దానవు. ఇందులోమాత్రము తెలివిలేదు.

ఉ. ఒక్కనిగూడఁగావలె మ ♦ ఱొక్కనితో పలుకాడనౌను నిం
కొక్కనిఁ జేర్పఁగానగును ♦ నొప్పగ బ్రక్కగదిన్ మఱొక్కనిన్
నిక్కముగాగ రమ్మనుచు ♦ నే నుడువన్ వలె నంతెగాక ని
ట్లొక్కనితోడ సంతతము ♦ నుండుట యొప్పునె వేశ్యకాంతకున్.

అమ్మాయీ! పండితులు శతావధానము సేయునట్లే, మనము విటులయెడలఁ జేయుకార్యములు నడుచుచుండవలయును.

చింతా—అమ్మా! శతావధానమునకును, మనచర్యకును బోలికయా! చాలుఁ జాలు.

సీ. వెలసతిఁ జూడని ♦ విబుధులంబట్టి కు
క్కలఁజేసి యింటిలో ♦ గట్టినాను
కులకాంత నెప్పుడు ♦ విడువనొల్లని వారి
మోహాబ్ధిలోపల ♦ ముంచినాను
యాచార మనువారి ♦ నట్టెబట్టుక నోట
గట్టిగా "తమ్మను" ♦ బెట్టినాను
విషయమే యెఱుఁగని ♦ విజ్ఞానులందెచ్చి
విషయేచ్ఛఁ గలిగించి ♦ వెలసినాను
తే. గీ. సర్వమును రోసిన యతీ ♦ శ్వరులఁబట్టి
విటులుగాఁ జేసి యున్నాను; ♦ విటులఁబట్టి
సర్వమునురోసి చను యతీ ♦ శ్వరులుగాఁగ
మార్చియున్నాను వేయేల ♦ మగువ వినుము.
సీ. కడు లోభియైనట్టి ♦ గారయ్య శ్రేష్ఠికిఁ
జిప్ప చేతికిరాఁగఁ ♦ జేసినాను
చిల్లిగవ్వయుఁ గూడఁ ♦ జేర్చిన బంగారు
సెట్టిని యతులలోఁ ♦ జేర్చినాను
యిల కుబేరునకు నీ♦డైన, జమీందారు
శిరమును నున్నగా ♦ గొరిగినాను
ధనముండెనంచును ♦ ఘన గర్వమూనిన
ధీరులఁ దిరిప మె ♦ త్తించినాను
తే. గీ. యింతయేటికి వెలఁది! నీ ♦ కేమి తెలియు
నల్లరాతిపైనుండి ధ ♦ నంబులాగి
నాను; నాకు నీడౌ వార ♦ నారి యెందుఁ
గల్ల దనుభంగి విఖ్యాతిఁ ♦ గాంచినాను.
సీ. ఒకసారి క్రీగంట ♦ నొప్పుగాపేక్షించి
చిత్రమా నగల నా ♦ ర్జించినాను
సుద్దులం జెప్పుచు ♦ ముద్దు మాత్రమొయిచ్చి
దుద్దులజత లెన్నొ ♦ దోచినాను

కల్ల ప్రేమను జూపి ♦ కౌఁగలించినయంత
వేలు నూరులు గుణి ♦ పించినాను
హస్తంబు దగిలించి ♦ యరగంటలోపల
నెన్నో మాన్యముల వ్రాయించినాను

తే. గీ. వేయు నేటికిఁ బ్రతికా ♦ విటులయెడలఁ
జేయవలసిన పనులన్ని ♦ చేసి; రక్ష
కభటులవిధాన నాయిల్లు ♦ గాఁచియుండు
నట్లు వారినిగావించి ♦ యలరినాను.

చింతా—మనమెంత యార్జించుచున్నను మన మేరోజున కారోజే యిబ్బంది పడుచుందుము. ఇది మనకు శాపము గాఁబోలు. అదియుంగాక యింత పాపమొనర్చి యార్జించిన సొమ్ము నిలుచునా?

శ్రీహ—అమ్మాయీ! మనసంపాదన పాపమని నీ వెప్పుడును దలంపరాదు.

చింతా—ఈదుర్వృత్తి పాపముగాక పుణ్యమా?

శ్రీహ—నీవు వెఱ్ఱిదానవు. "కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా" అని నీవు చదివినది మఱచిపోయినావు కాఁబోలు!

చింతా—ఎంత విద్యావంతురాలనైనను నీమాటకు మాత్రము నేను జవాబు చెప్పలేను.

శ్రీహ—అన్ని విషయములలోను నీకుఁ దెలివి కేమియు లోపములేదు. కాని, మన కులవృత్తి విషయములోనే నీవు సరిగా గమనించుటలేదు. ఆ గోపాలము కూఁతురగు రాజరత్నమును జూచితివా? అది నీకంటె జక్కనిదా? నీకాలిగోరునకైనను జాలదు. కాని, కులవృత్తి విషయములో మంచి చాకచక్యమున్నది.

సీ. వెలలేని సౌధ మ ♦ ర్పించిన రామయ్య
దారిద్ర్యంబుదోఁచి స్వ ♦ ర్గంబుఁజేర్చె

పరకాంత నెన్నఁడు ♦ బరికించి యెఱుఁగని
శేషగిర్యాఖ్యునిఁ ♦ జేరఁదీసె
ఆర్యవందితుఁడైన ♦ సూర్యనారాయణు
మోహాబ్ధియందున ♦ ముంచివైచె
వరభిషఙ్మణియాచు ♦ వరలు సీతారాము
వలపెంతొ చూపించి ♦ పదిల పఱచె

తే. గీ. యొకఁడు వచ్చినజాడ వే ♦ రొకనికింత
యేని దెలియకుండెడిరీతి ♦ నెట్లుమెలఁగు
చున్నదో కనలేదె! యా ♦ సుదతినైన
జూచి నేర్చుకొనుమ నీవు ♦ శోభనాంగి.

చింతా—నేను నేర్చుకొనవలసినవిషయము లన్నియు నొక్కటియు గొఱఁతలేకుండ నన్నియు నీవే బోధించితివి.

శ్రీహ—ఏమి లాభము! అన్నియు "గుంటఁబెట్టి గంటవాయించితివి." నేఁ డేమైనను సరే! నీవు మధుసూదనునితో నింక మనగృహమునకు రావలదని చెప్పుము.

తే. గీ. అతివ! "దీపమున్నప్డె గృ ♦ హంబు జక్క
బెట్టుకొనవలె" ననురీతి ♦ వేశ్యకాంత
యౌవనమునందె యార్జించి ♦ యలరవలయు
వయసు ముదిరిన నేమి లా ♦ భంబు గలదు.

ఇంక నీవు మధుసూదనునియెడల మొగమోటమి విడిచి వర్తింపుము.

చింతా—అమ్మా! నేనొక్కటి చెప్పెదను వినుము. తక్కిన వేశ్యలకును, నాకును నించుక భేదమున్నది. నేను విద్యావంతురాల నగుటచే గొంచె మాలోచించుచుందును. అంతియేగాని మఱియొకటి గాదు.

సీ. మురిపెంబు జూపించి ♦ మొహరీలు మాడలు
పెద్దకానులును దె ♦ ప్పించినాను

చీరెలులేవంచు ♦ జీకాకు గనఁజేసి
మెఱుగుబోడినగ ల ♦ మ్మించినాను
చుట్టాలు వచ్చిరి ♦ చూడఁగా మమ్మంచు
ముంజేతి గొలుసులు ♦ గుంజినాను
వైద్యున కీయంగ ♦ వలెనంచు మురుగుల
మ్మించి తాకట్టు పె ♦ ట్టించినాను

తే. గీ. యిన్ని చెప్పనేల యతని ♦ కున్న యట్టి
తోఁటలును గృహములు గొడ్లు ♦ తుదకు భార్య
కంఠమున సూత్రమునుగూడఁ ♦ గరుణ లేక
యమ్మఁగాజేసి యీరీతి ♦ నేలరినాను.

అందుచేత నాతనిని నింత తొందరగా వెళ్ళుమని చెప్పుటకు గొంచెము వెనుకముందులు చూచుచున్నాను.

శ్రీహ— వేశ్యవృత్తికి యీజాలి బొత్తిగా సరిపడదు. ఒక్కనితోడనే యుండుటకు మనమేమైన సంసారులమా! వీరందఱును మన గళమునఁ దాళిబొట్టుఁ గట్టినవారా! ఈ విషయమున నేను చెప్పినవన్నియు మఱచిపోయినావు. చూడుము.

సీ. కురులులేకున్న స ♦ వరమొక్కటి సొంపు
జూపింప దలలోనఁ ♦ జుట్టవలయు
స్తనభారమధికమై ♦ గనుపట్ట రెవికపై
రెవికెను వేడ్కధ ♦ రింపవలయు
మొగమందు మచ్చలు ♦ నగపడకుండఁగా
"పౌడరు" చేత గ ♦ ప్పంగవలయు
నధర మెఱ్ఱగనుండ ♦ న ల్లెఱ్ఱ రంగును
దగిలించి వింతగాఁ ♦ దనరవలయు

తే. గీ. తమలపాకులు నమలుచు ♦ దనరవలయు
నవ్వు మోముపైఁ జూపట్టు ♦ నట్టికరణి

సరసవాక్యము లాడుచు ♦ సందెవేళ
వీధి గుమ్మమువద్దను వెలయ వలయు.

వీధిగుమ్మములో నిలఁబడుట యనఁగా స్థావరజంగమాకృతిః నుండుమనికాదు. ఉన్నవ్యాపారమంతయు నా నిలబడుటలోనే యున్నది

సీ. సరసులెవ్వారు వెల ♦ సతులవాకిటి కరు
దెంచుచుందురో పరీ ♦ క్షించవలయు
కని, కనిపించని ♦ కరణిని నాస్యంబుఁ
జూపుచు వారినిఁ ♦ జూడవలయు
జేతితో బిలువక ♦ చిత్తంబు జల్లుమ
నఁగఁజిఱునవ్వను ♦ నవ్వవలయు
నడుగైన నావల ♦ కిడకుండ సుమశరం
బుల నేలుచూపుల ♦ గొలుపవలయు

తే. గీ. హృదయమంతయు నొకసారి ♦ యూగులాడ
బైట నిటునటు సర్దుచుఁ ♦ బరగవలయు
గబ్బిగుబ్బల మేటిపొం ♦ కంబుఁజూపి
చిత్తము వికారమందంగఁ ♦ జేయవలయు.

సీ. తోయజాస్త్రునిచేతి ♦ తూపులో యనునట్లు
బల్ చూపులను మీఁద ♦ బరపవలయు
ఎటులైనఁ దనకన్ను ♦ చిటికెలో మనమీఁదఁ
బడునట్లు గావించి ♦ వరలవలయు
వ్యామోహ మనునట్టి ♦ వలబన్ని దానిలో
జిక్కెడు విధమునఁ ♦ జేయవలయు
జిక్కికొన్నవిటునిఁ ♦ జేరగాదీసి మా
యవలపుతో గట్టి ♦ యలరవలయు

తే. గీ. నిటు నటు గదలలేకుండ ♦ నెన్ని యుచ్చు
తాళ్ళ గట్టంగవలయునో ♦ తప్పకుండ

వాసినన్నింట బిగియించి ♦ పదిల పఱచి
బూటకపు నాటకమునందు ♦ బొమ్మ జేసి
విటుని నాడింపవలయును ♦ వేశ్యకాంత.

సీ. నీమీఁదనే నాకుఁ ♦ బ్రేమయున్నదటంచు
మించు మోదమున భా ♦ షించవలయు
నీవు రాకున్న నే ♦ నిముషమైనను నోర్వ
సంచును గన్నీరు ♦ నించవలయు
గాఢానురాగంబు ♦ గలిగినట్లు శిరంబు
బొమ్మనగదియించి ♦ ముద్దుకొమ్మవలయు
లేనట్టి వలపు నె ♦ ల్లెని దెచ్చుకొనుచు
కొసరిముద్దులు వేడ్కఁ ♦ గొనఁగవలయు

తే. గీ. మాటలాడిన నెంతయో ♦ మమతఁగల్గు
నట్టివిధమును జూచి మా ♦ టాడవలయు
వెలది! విటుల విషయమున ♦ వెల వెలంది
యాచరింపంగ దగిన కృ ♦ త్యంబు లివ్వి.

తే. గీ. వేయునేటికి దరుణిరో ♦ వినుమ విటుల
హృదయములు జూఁడగొనుటకై ♦ యింతిమనము
నిలయమై యుండవలె మాయ ♦ వలపునకును
కల్లప్రేమ కసత్యవా ♦ క్యంబులకును.

చ. విటుఁ డెవడైనఁగాని విను ♦ వేడ్కలరారఁగ జందురిఁడంచునన్
బటుతరభంగి వాని సలు ♦ పఁగవలె సన్నుతి; నట్లుసేయుచున్
దటుకున లాగుచుండవలె ♦ ద్రవ్యమువచ్చిన యంతమట్టుకున్
కుటిలవినీలకుంతలల ♦ కున్ ఘనగౌరవ మిందె యబ్బెడిన్.

చిం—అమ్మా! ఇది యంతయు నిదివఱకు నీవు పాడినపాటయేకదా. నీవు చెప్పిన విషయములన్నియు నేను గమనించియే యుంటిని. వానికి భంగములేకుండనే వర్తించుచుంటిని. ఇఁక నేఁజేసిన లోప మేమున్నది?

సీ. మేళానఁజూచి, వి ♦ రాళిఁ బొందినయట్టి
పూర్ణయ్య కొంపను ♦ ముంచినాను
మోము జూచినయంత ♦ మోహంబు నొందిన
కమలనాభుని నేటఁ ♦ గలిపినాను
పాటకు మెచ్చినక్ ♦ వలచి వచ్చినయట్టి
కొండయ్యకును మంతఁ ♦ గూర్చినాను
నన్నెయిల్లాలుగా ♦ నమ్మిన మాధ్వుడౌ
శ్రీపతిన్ జోగిగాఁ ♦ జేసినాను
తే. గీ. యిరుగు పొరుగూళ్ళ కెపుడేని ♦ యేగునపుడు
విడిచియుండగలేక నా ♦ వెంట గుక్క-
సరణి వచ్చుచుండెడి భాగ్య ♦ శాలియైన
శిష్టికరణము తల బోడి ♦ జేసినాను.

ఇంక మధుసూదనుని విషయములే చెప్పినక్కరలేదు. అతనికిని నేడో రేపో చెప్పదలంచియే యుంటిని.

శ్రీహ—ఇంకను నేడో రేపో యేమిటి? ఒకవేళ నీవుచెప్పుటకు సంశయించుచుంటివేని, నన్నప్పగించుము.

చింతా—అమ్మా! అంత అవసరము లేదు. ఆతని కెవ్వరో మిత్రుఁడు కొంతధనము ఋణముగా నిచ్చెదనని చెప్పియున్నాఁడట. ఆవిషయమై కనుఁగొనఁ బోయినాఁడు. ఇంతలో మనము తొందరపడనేల!

శ్రీహ—అమ్మాయీ! నీకింకను బిచ్చిభ్రమ పోలేదు. ఆతనియొద్దనున్న యాస్తియంతయు విక్రయించివేసెనని మనయూరిలో బ్రతివానికిని దెలియును. అట్టిచో నీతని కెవ్వరు దేనినిజూచి ఋణము నిచ్చును? ఆతని బూటకపుమాటల నీవు నమ్మవలదు. ఇట్టివారిని మనమెంతమందిని జూచినాము. ఇదియుంగాక, యీతఁడు వ్యాపారిబిడ్డ, సామాన్యుఁడుగాడు. మనకంటె నెక్కువ టక్కులు నేర్చినవాఁడు. ఎట్లో యీవిధముగానే

కొన్నిరోజులు కాలక్షేపము జేయుట కిన్ని మాయవాక్యములు పలుకుచుండును.

చింతా—కానీ! రెండు మూడు రోజులు చూతము.

(సుబ్బలక్ష్మి ప్రవేశించును.)

సుబ్బ—(శ్రీహరిని చూచి) పెద్దమ్మాయి—దేవాంగపాయనే—శరబలింగం వొచ్చాడు.

శ్రీహ—ఏమైనా చీరెలు దెచ్చినాఁడా?

సుబ్బ—అబ్బో! సాలా పెద్దమూ ట్టెంచుకొచ్చాడు.

శ్రీహ—(చింతామణినిఁ జూచి) అమ్మాయీ! చూచితివా! శరభలింగంవద్ద యెక్కడనులేని పట్టుచీరె లనేకరకములుండును. నెమ్మదిగా నీతనియొద్ద కొన్ని మనము "పెరుమాళ్ళారగింపు" చేయవలయును. ఈతని నిప్పుడు నీవశము జేసికొంటివా మనకెక్కడలేని చీరెలు దొరకును.

చింతా—పెద్దపెద్దలందఱును వచ్చుచుఁ బోవుచుండిరికదా! ఈస్వల్పపు వ్యాపారమునం దేల దిగవలయును?

శ్రీహ—చాలుచాలు నీమాటలు. వేశ్యలకు కొద్దిగొప్పలతో నేమి పనియున్నది? వర్తకుడైనవాడు పెద్దవ్యాపారమును జేయును. చిన్నవ్యాపారమును జేయును. "చిల్లర" మహాలక్ష్మి యని పెద్దలు చెప్పినారు. ఈవిషయమునన్న పరమరహస్యము నీకుఁ దెలియలేదు కాబోలు? వినుము.

సీ. దినవెచ్చమును దెచ్చి ♦ తిన్నగా నిచ్చుచుఁ
బరమమోదమునందు ♦ వైశ్యుఁడొకఁడు
వలసినచీరెలు ♦ వస్త్రంబులను దెచ్చి
యర్పించుచుండు దే ♦ వాంగియొకఁడు
డబ్బేమి గొనకుండ ♦ నుబ్బి నగలుజేసి
గూరిమినిచ్చు సో ♦ న్నారియొకఁడు
యనుదినంబును మంచి ♦ యత్తర్వు గొనితెచ్చి
యిచ్చి మోదించు సా ♦ హేబొకఁడు

తే. గీ. వేశ్యకును ముఖ్యమైనట్టి ♦ విటులటంచు
జిత్తమందున నెంచుమీ ♦ చిగురుబోఁడి
వారులేకున్న నే వార ♦ నారిమైనఁ
గాపురము సేయఁగలదె జ♦ గంబునందు.

ఒకవేళ నేవిటుండైనను జేరదీసినను నేఁ జెప్పినవారు వచ్చుచు బోవుచుండుట కావంతయు నభ్యంతరముండదు. వీరిరాక యజమాని కనుమానము వొడమనీయదు. ఇట్టివన్నియు వేశ్యలకొక్క వేద శాస్త్ర రహస్యములు.

(తెరలో)

ఏమ్మాటా- సెప్ప రే- కావాలా-లేదా?

శ్రీహ——(చింతామణినిఁ జూచి) అమ్మాయీ! ఆతని నిక్కడకుఁ దోడ్కొని వచ్చెదను. ఎట్లు వలలోఁ బడవేసెదవో!

(నిష్క్రమించును.)

చింతా——(తనలో) వేశ్యవృత్తి యెంత హేయమైనది.

తే. గీ. ఇతఁడు బ్రాహ్మణుండు మరియు ♦ నితఁడు వైశ్యుఁ
డితఁడు కంసాలి, దేవాంగి ♦ యితఁడు; యితఁడు
కమ్మ; యనునట్టి భేదంబు ♦ గాంచకుండ
వలపు గలిగించి కూడంగ ♦ వలయు సకట
వారసతి వర్తనము పశు ♦ వర్తనంబు.

సుబ్బ——అక్కయ్యోవ్! చెరబలింగాన్ని మెల్లిగా వొకకో కొండు పెయ్యాలి.

చింతా——(తనలో) దీని బ్రతుకుఁ గాంచిన నాకెంతయు జాలియగుచు న్నది. ఇట్టికన్నెలు ప్రతి వేశ్యాగృహమున నుందురుగదా! వీరు తొలిజన్మమున నెట్టిపాపమును జేసికొని యుండుటంజేసి యీ జన్మమున నిట్టి నీచపు బ్రతుకు ప్రాప్తించినదో కదా!

సీ. పట్టుపాన్పున వేశ్య ♦ పవళింప విరలు
పాషాణ వేదిక ♦ బండవలయు

వెలలేని చీరెలు ♦ వేశ్యధరింపంగ
బాత్రితది వీరుదా ♦ ల్పంగవలయు
షడ్రసోపేత భో ♦ జనముసేయగ వేశ్య
మిగిలిన వీరు మె ♦ క్కంగవలయు
వారసతి ధరించి ♦ పారవేసిన పూల
బంతులకా వీరుదా ♦ ల్పంగవలయు

తే. గీ. నింటిలోన నుండెడి పను ♦ లెల్లజేయ
వలయు; విటకాంద్రు వచ్చెడి ♦ భంగి నరయ
వలయు; కటకటా వీరి పా ♦ పం బదేమొ
మిగుల నీచమౌ బ్రతుకన ♦ మెలఁగ వలసె.

(అంతట శ్రీహరి శరభలింగముతోఁ బ్రవేశించును.)

శ్రీహ—రండీ! శరబలింగంగారూ! ఈమధ్య బొత్తిగా మామీద శీత కన్ను వేసినారు. అనుదినమును మాఅమ్మాయి శరభలింగం గారు కనపడుట లేదేమని యడుగుచుండును. ఒకవేళ మా యింటికి వస్తే బట్టలమూట యేమైనా మేము తీసికొందుమని తలంపలేదుకదా!

శర—ఎంతమాట సెప్పావు. చరబలింగం వంతనుమానపోడు కాదు.

చింతా—అమ్మా! ఈయనతో మనకేమి పనియున్నది? ఈరోజున నీయన దారితప్పి యిట్లు వచ్చినారు. ఎప్పుడూ వారు కంజాక్షి యింటికేగాని యితరులయిండ్లకు వెళ్ళరు.

శర—సరిసరిలే. కంజాక్షికి నాకూ యేదైన తగులాట ముండదను కొంటుండావా యేంటి.

చింతా—వుండఁగూడదా యేమి! మీరు మగవారు కారా! అది వేశ్యకాదా.

శర—అబ్బే యాబ్రాసిముండ. దానికే సెవఁడు సూస్తాడు.

శ్రీహ—అమ్మాయీ! నీవు శరభలింగంగారి విషయంలోనా చమ త్కారముగ మాటలాడుట. ఆయునను నీవెట్లు గౌరవింపవ లెను? (శరభలింగమును జూచి) అల్లుఁడుగారూ! పిల్లదానితో

నేమిలెండి. అవునుగాని, నే నిప్పుడు చూచిన పట్టుచీరె యేమా త్రిము ఖరీదులోవుంది? అది మాకేమయిన నందుబాటులో వుండునా?

శర—(తనలో) ఏంటో! యీాళ్ళకు కరీదు సెప్పేదేంటి. ఈసీరిచ్చినా నంటే కూంతమొగవోటవన్నా కుదురుతాది. (ప్రకాశముగా) అత్తయ్యా! మీాకు నాకు బేరాలేంటి. మెదవడబ్బు మర్యా దుండాలి కాని.

చింతా—అమ్మా! శరభలింగంగారికి మనమీాద నెంతైన యనురాగ మున్నది. ఏది! నీవు చూచిన చీరె?

శ్రీహ—(సుబ్బలక్ష్మిని జూచి) సుబ్బలక్ష్మీ! మూట మోసికొని వచ్చిన వానిదగ్గఱనున్న యాచీరె నిట్లు పెమ్ము.

సుబ్బ—(నిష్క్రమించి వెంటనేప్రవేశించి చీరెను చింతామణికిచ్చును.)

చింతా—(చీరెపుచ్చుకొని) శరభలింగముగారూ! ఇది యెక్కడనుంచి తెప్పించినారు?

శర—మాకేంకర్మం తెప్పించాలని. మేము నెయ్యలేవా యేంటి. చరబ లింగవంటే సామాన్యు డనుకొన్నావా యేంటి! మగ్గందగ్గిర కూ సుండానంటే దెబ్బకు మూారెడు జరుగుతుంది.

శ్రీహ—మీారెక్కడ దేవాంగబ్రాహ్మణులు.

శర—దేవ్రాంగులంటే సామాన్యులనుకొంటుండావా యేంటి. దేవ్రత లకు అంగోస్త్రాలు "సర్ప్రాయి" సెయ్యడంచేత దేవ్రాంగు లని పేరొచ్చింది. మాకులంతో సరియైనకుల వింకోటివుందా! అయితే వొక్క సిన్నకిటుకొచ్చింది. మొగోళ్ళు కాత్త తాగు బోతులు ఆడోళ్ళు కొందరు కూంత కక్కుర్తిపడ్తారు. అది లేకపోతే సెప్పనా! రెండో భేమ్మలముగావా?

చింతా—(తనలో) వీడిమాటలు కూలిపోవ! ఏమి చమత్కారముగ నున్నవి! (ప్రకాశముగా) శరభలింగంగారూ! ఈచీరె నేను ధరించి మీాయెదుట నిలచినచో నెట్లుండును?

శర—అసలే సుక్కల్లో శంద్రుడులా గుంటావు. ఈ సీర సింగారిత్తే పట్టపగ్గాలుంటాయా! ఏది కట్టుకో సూస్తాను.

శ్రీహ—(చింతామణినిఁజూచి) అల్లుడుగారి సెలవైనది. కట్టుకొని వారికిఁ జూపించు.

చింతా—(నిష్క్రమించి వెంటనే క్రొత్తచీరె గట్టుకొని ప్రవేశించును.)

శర—అబ్బా! అబ్బా! సింతామణి సీరసింగారిస్తే మనస్సు పరిపరి యిధాల పరుగులెట్టుతావుండది.

చింతా—(తనలో) వీనికిఁ బెద్దరోగము పుట్టినది. (సుబ్బలక్ష్మినిఁ జూచి) సుబ్బలక్ష్మి! శరభలింగముగారికి తాంబూల మియ్యవేమె!

సుబ్బ—ఇదిగో! ఇత్తుండా. (శరభలింగమునుజూచి) బావయ్యగారూ! నాకో సిన్నచీరె యియ్యరూ!

శర—నీకూ సీరకావాలి. మూటలోనుంటాది నేతసీర తెచ్చుకో.

సుబ్బ—(చంకలు కొట్టుకొనుచు నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) అక్కయ్యోవ్! ఇదిగో సీర శరబలింగం బావయ్యగా రిచ్చారని సెప్పుకుంటాను.

శర—(తనలో) రవ్వంటిసీర చివార్పణమైంది. అయితేనేం. సింతామణితో చరసం సెయ్యడమే సెయ్యడం. దీన్నిసూస్తా యిక్కడ కూకుంటే వొళ్ళు దడదడమంటూ వుండది. ఇప్పుడే సీరయిచ్చామూ! ఆచంగతి కూంత కదిపితే భారీగుణానికి లోపం వత్తుంది. మరోప్పుడు. కానీ. (శ్రీహరిని జూచి) శ్రీహరీ! సాలా పనుంది యెళ్ళొత్తాను.

శ్రీహ—దయయుంచండి. వీరాకు మేమెప్పుడూ యభ్యంతరము గలుగ జేయువారము గాము.

శర—(చింతామణిం జూచుచు నిష్క్రమించును.)

శ్రీహ—(సుబ్బలక్ష్మినిఁ జూచి) సుబ్బలక్ష్మి! ఆచీరె యిప్పుడే కట్టుకొనకు. ఉన్నచీరెలు చినుగనిమ్ము.

సుబ్బ—అక్కయ్యనేతి కిచ్చి దాపించుకొంటా.

చింతా—(తనలో)

తే. గీ. సరసత యనంగనేమొ, యా ♦ సరణిలేక
మాటలపసందులేక యి ♦ మ్మాడ్కి వేశ్య
కాంతలను జేరు విటులను ♦ గాంచినంత
నవ్వువచ్చును నాకు మ ♦ నంబునందు.

సుబ్బ—అక్కా! అన్నంవేళైంది. లే.

శ్రీహ—అమ్మాయీ! లెమ్మ.

చింతా—ఇదిగో! వచ్చుచున్నాను.

ఇది ద్వితీయాంకము.



# చింతామణి.

లేక

## లీలాశుక.

## తృతీయాంకము.

---

రంగము:—[చింతామణి శయనగృహము:—ప్రవేశము:—
చింతామణి, శ్రీహరి]

శ్రీహ.—వింటివా? నే నెందుకుఁ జెప్పితినో!

తే. గీ. చిత్తమందు గోరికజనిం ♦ చినను గాని
పురుషుఁ డెప్పుడు మనవార ♦ తరుణులుండు
వాడ కేరాడు; కావున ♦ వానిజాడ
నరసి; యెట్లైన మనయింట ♦ నడుగుబెట్ట
సలుపవలయును సమ్మోహ ♦ శరము బఱపి.

ఈ విషయమున నతిజాగరూకతతో నుండవలయును. వేశ్యవాడ కరుదెంచిన యాపురుషునిచూపులే గృహముపైఁ బ్రసరించుచున్నవో యెఱుంగవలయును. సాధ్యమగునంతవఱకు జూపులచేత, చేష్టలచేత, వానిని వశునిగాఁ జేసికొని యింటఁ బ్రవేశ పెట్టవలయును.

గృహప్రవేశ మహోత్సవమునకే మనముత్రోలుత కష్టపడవలయును. తరువాత కట్టుకట్టబడిన పామువలె మనమెక్కడ నుండుమనిన నక్కడనే యావిటుఁడుండును (ఇంచుకయూరకుండి) ఇంతకును నేను చెప్పఁదలఁచిన మాటయే మఱచి పోయితిని. ఈమధ్యనాలుగురోజులనుండి బాదంవారి పిల్లవాడు, నీవు చూడలేదటే, రమణయ్యగారంటారు. అతడు సంధ్యవేళ ననుదినమును నిట్లు వచ్చుచున్నాడు. ఈతనిని నీవుపోనీయరాదు. ఇట్టివారే మనకు ముఖ్యముగ నుండవలసినవారు.

తే. గీ. మోహ వారాసిలోపల ♦ మున్గియుండు
మత్స్యమె విటుండు; వెలసతీ ♦ మణియె వల్లె
వీక్షణంబను గాలముఁ ♦ విడిచి వాని
బట్టి; మాయవలప నా ♦ బుట్టయందు
బెట్టి మోదంబు నందుచు ♦ వెలయవలయు.

ఈబాదంవారి యబ్బాయి విషయములో నీవు మఱచియుండవలదు. ఇప్పటివఱకు నీతని చిత్తము పెద్దాపురపు వేశ్యకాంతల మీఁద నున్నది. నీ వెట్లయినను నీతనిని వలలోఁ బడవేసికొని, పెద్దాపురపు "కాంతా" నీవైపునకు ద్రిప్పుకొనుము.

(సుబ్బలక్ష్మి ప్రవేశించును.)

సుబ్బ—(శ్రీహరినిఁజూచి) పెద్దమ్మా! చుబ్బిచెట్టి వచ్చాఁడు.

చింతా—ఏ సుబ్బిసెట్టి?

శ్రీహ—నీకంతా మఱుపే! మనవూళ్ళో పెద్దషాహుకారు కొడుకు. ఈతనితండ్రి యీమధ్యనే పోయినాఁడు. పెత్తనమంతా యీతనిదే.

చింతా—తెలిసినది. తెలిసినది. మొన్న యీతని యింటిప్రక్కనున్న షావుకారింటఁ బెండ్లికి మేళమునకై యరిగినప్పు డీతఁడు నన్ను జూచినాఁడు. ఆకారణముచేతనే యీతనికి వెఱ్ఱియెత్తి వచ్చియుండును.

శ్రీహ——చూచితివా! అమ్మాయీ! మేళంవలన నెంత ప్రయోజన మున్నదో! కొందఱు సంఘసంస్కారప్రియులు బయలుదేరి వేశ్యలను మేళమునకుఁ బిలువఁగూడదని పలుకుచుందురు. నిజముగా మన బ్రతుకంతయు మేళములమీఁదనే నిలచియున్నది.

సీ. కాళ్లకుఁ గజ్జెలు ♦ గట్టి యాడునపుడు
పరవశత్వముఁజెంది ♦ బరగు నొకఁడు
శృంగారరసమెంతొ ♦ పొంగి పొరలఁబాడ
డెందమున వికార ♦ మొందు నొకఁడు
హస్తముల్ ద్రిప్పుచు ♦ నాడుచుండుటనుజూ
చి మదిని ఖంగారు ♦ జెందు నొకఁడు
వనజాస్త్రు తూపులా ♦ యన నొప్పుచూపులం
గాంచి విరాళినిఁ ♦ గాంచు నొకఁడు
తే. గీ. మృదుల భాషణంబులకును ♦ మెచ్చు నొకఁడు
చీరె తగిలిన ముదమును ♦ జెందు నొకఁడు
మాయముస్తాబు వీక్షించి ♦ మఱగు నొకఁడు
హంసనడకల కానంద ♦ మందు నొకఁడు.

మేళముల కరిగినప్పుడే మన సౌందర్యాది విశేషములు పదిమందికిఁ దెలియును. వివాహాదికార్యములలో నూరేగింపుమహోత్సవ సందర్భమున మేళము వెనుక నెంతమంది శునకంబులట్లు వచ్చుచుందురో చూడలేదా? జనసంఘ మెక్కువగానున్నస్థలము లందు మనలఁజూచుట కొకరి భుజములపై నొకరు చేతులువైచి యదిమిపట్టుచు, గాలివ్రేళ్ళపై నిలుచుండి చూడకపోయినచోఁ బ్రాణములు నిలువనట్లు నానాపస్థలఁ బడుచుందురు.

తే. గీ. విటుల మనములఁ గోర్కెలు ♦ వెలయఁజేసి
పడపుగత్తెల యిండ్లకుఁ ♦ బరుగులిడఁగ
జేయఁజాలిన మంత్రమై ♦ చెలఁగు, గాదె
మేళముండిన నెంతయో ♦ మేలుమనకు.

(ఇంచుక యూరకుండి) పాపము సుబ్బిశెట్టిగారు నిలఁబడియేయున్నారుగాఁబోలు. (నిష్క్రమించి వెంట నేసుబ్బిశెట్టితో బ్రవేశించును.)

శ్రీహ—(చింతామణినిఁజూచి) అమ్మాయీ! యీరోజున మనయందు సంపూర్ణమైన కృపవహించి సుబ్బిశెట్టిగారు వచ్చినారు. వీరి నెట్లు మర్యాద జేయుదువో ఏమాత్రము లోటువచ్చినను గౌరవము దక్కదు.

చింతా—(సుబ్బలక్ష్మినిఁజూచి) సుబ్బలక్ష్మీ! చూచెదవేమి! పెద్ద మనుష్యులు నిలఁబడియుండిరి. ఆకుర్చీ యిటువేయుము.

సుబ్బ—కుర్చీ తెచ్చును.

చింతా—సెట్టిగారూ! నిలఁబడితిరేమి! నేను మీకు పరాయిదాననా యేమి? కుర్చీమీదఁ గూర్చుండుడు.

సుబ్బి—(కుర్చీమీదఁ గూర్చుండును.)

సుబ్బ—మాబావయ్యగారికి కుర్చీ సరీంగా సరిపోయింది. అటూ యిటూ రవ్వొంతైనా జాగాలేదు.

శ్రీహ—ఏడిశావు. ఇటువంటిమాట కున్నావు.

సుబ్బి—(సుబ్బలక్ష్మినిఁ జూచి) నన్నుజూస్తే నీకు యెకచకాలుగా వుందేం!

చింతా—సెట్టిగారూ! ఈరోజున మీరు మాయింటికి దారితప్పి వచ్చి నట్లున్నారు. మనోహరం మిమ్ము రానిచ్చినదా?

సుబ్బి—ఆడితస్సాగొయ్యా! మనోహరవింటి కేవఁ జెళ్ళుతున్నాఁడు. అప్పుడెప్పుడో కాస్త భెవపుట్టి యెళ్ళాను. యెళ్ళానన్నమాటే గాని యేంటో ఛట్కారిముండ. యేమనిసి కెల్లా గౌరవం సెయ్యాలో దానికేం తెల్సు.

చింతా—సెట్టిగారూ! అది సరియైన వేశ్యగనుకనా, మిమ్ముఁ దగిన భంగి గౌరవ మొనర్చుటకు.

సుబ్బి—(శ్రీహరినిఁజూచి) ఏంశేంటి. అత్తమ్మా! అదిసరియైందికాదే. మీబోగవోళ్లలో రెండుకా బుంటాయా యేంటి.

శ్రీహ — సెట్టిగారి కీసంగతి యింకను గోచరము కాలేదు కాబోలు! మా వేశ్యలలో నెక్కడనో గాని సంతానయోగ ముండదు. అందుచేత పల్లె, యానాది, యుప్పరి, యీడిగె మొదలగు నీచకులములలోని పిల్లలను ధనమిచ్చి తెచ్చుకొని యాట పాటలు నేర్పించెదరు. అది వేశ్యయే యగును. ఇట్టివారే మాలోఁ బెక్కండ్రు న్నారు.

సుబ్బి — ఏంటి. సెప్పవింకాను. నిజవే యీసంగతి. ఇంత కష్టపడ్డా భోగంవోళ్లకు పిల్ల లుట్టకపోవడం అమ్మోరి శాపంకావోసు. పైకి డాబుగా యేసాలు యేసేవాళ్లల్లా యీరకవే? నేను యేవో అనుకొన్నాను.

శ్రీహ — ఈవిషయములో సందేహ మేమియులేదు.

సీ. సామర్లగోటలో ♦ సంతలోఁ గొన్న గ
వల్లది నేఁడుగో ♦ పాలమయ్యె
మూఁడుకాసులనిచ్చి ♦ పుచ్చుకొన్న రజకి
పద్మాక్షియై నేఁడు ♦ పరిణమించె
కనిపెంచలేక యి ♦ చ్చిన దెచ్చుకొనినట్టి
పల్లెది పుష్పమై ♦ పరిఢవిల్లె
సాలెవిధవకును ♦ జన్మమందిన ముండ
వనజాక్షియై యెంతో ♦ వాసిగాంచె

తే. గీ. యాటపాటలనేర్చి శ్రీ ♦ ధరమనంగ
బొల్పెసగినది యానాది ♦ ముండకాదె!
వేయునేటికి మీరును ♦ వెళ్లినట్టి
పాతకి మనోహరంబు ను ♦ ప్పరిదికాదె.

సుబ్బి — అష్షె! ఇంతేనా యీళ్ల పటాటోపం. ఈళ్లందటిమాట కేవిగాని; మనోహరంయివయంలో నీవు సెప్పినమాట నిజవే. ఉప్పరిది గనుకే కావోసు. ముద్దెట్టుకుంటే వుప్పగా వుంది. సీ! రోతేసింది.

చింతా—అటువంటిదానింట మీారేమని యడుగుబెట్టితిరి

సుబ్బి—బుద్ధి గడ్డితిని యెల్లినాము. సెంపలేసుకుంటాను. ఇంకెప్పుడన్నా దానిం టడుగెట్టె మాఅబ్బాయితోడు.

చింతా—పోనీయండి. అంతమాట యెందుకు. మీానోటితోనేచెప్పుడు. మనోహరము బాగుండునా? నేను బాగుందునా?

సుబ్బి—ఆసెట్కారిముండకీ నీకు పోలికెక్కడ. నీది నికార్సుసరుకు. అందసందాల్లో అది నీలో యెన్నోవంతు.

సీ. సందమామకయినా ♦ సాల వంకున్నది
నీకేమి వంకుంది ♦ నీరజాచ్చి
సెంగల్వ పుస్పాలు ♦ సిగ్గంతో పడ్తాయి
నీకళ్ళు సూస్తేను ♦ నీలయేణి
సన్నని నీనడుం ♦ సక్కదనానికి
సింహాలు భయబడు ♦ సిగురుబోడి
నీనడకందంకు ♦ నిజవుగా హంసలు
తలలొంచుకుంటాయి ♦ కలికిమిన్న
తే. గీ. యింద్రునీలాల్ని యెక్కువ ♦ యెక్కిరించు
తాయి నీతలపీసులు ♦ ధరణిలోన
యెక్కడెతికినగాని మీా ♦ యేశ్యలందు
నీకు బోలింది దొరకదు ♦ నిజవు నిజవు.

ఇందర్లోకంలో యిందుర్డికి సింతామణివుంది. భూలోకంలో మాఅంటోళ్లందరికి నువ్వు సింతామణివి.

శ్రీహ—ఏమండోయి? సెట్టిగారూ! మేము తక్కిన వేశ్యలవంటి వారమని తలచితిరా యేమి! మాయంటి వాళ్లందఱుకును జింతామణివని పలుకుచున్నారు. అట్లైన్నడును నుడువకుఁడు. ఏమిటో మీావంటి పెద్దమనుష్యులతోడనే మాఅమ్మాయి మాటాడును. కాని, గోపాలంకొంపలాగున మాయిల్లు పందిలిదొడ్డికాదు.

సుబ్బి—అత్తమ్మా! కోంపడకు. కుసింత నోరుజారింది. మీసంగతి సందర్భాలు యెఱుగనాయేంటి. ఇప్పుడంటే మేవక్కడ మేడకట్టావుగాని, మాఅయ్య మీయింటిపక్కనేగా నాచేత సిల్లరదుకాణం పెట్టించాడు. అప్పుడు మీసింతామణి యెచ్చాలకి నాదగ్గరకొచ్చేది. బావయ్యా రవ్వంత! బెల్లవెట్టవా అని అడిగేది. అట్టాటిది, యిప్పుడు పెద్దదై నాకు సదువు సెప్తావుంది. మొన్న మాయింటిపక్క కోవట్లింట్లో మేళానికొచ్చింది. అప్పుడు సూశాను. మేజువాణీ కెల్లినాను. అబ్బా! యేవాట, యేంపాట. చిరినవ్వు నవ్వుతూ సేతులు తిప్పుకొంటూ నామూతిమీద పొడవబోయింది. పొడుస్తుందే అనుకొన్నాను. అంతపనిసేస్తే నలుగురూ యెకచకాలు చేసేవారే!

శ్రీహ—అల్లుడుగారూ! దానికి మీయం దతిమోహమున్నది. దాని యభిప్రాయము మీరు కనుగొందురుకదాయని యట్లు చేసినది. నిత్యము దానికి మీమీఁద మోహమున్నదని చెప్పనిఘడియుయే లేదు. నేను మీకు కబురుపంపినచో మీ రేమనుకొందురో యని తలఁచి యూరకొని భగవంతుఁడు మీదర్శన మెప్పటికి కొనఁగూర్చునో యని వేచియున్నాను.

సుబ్బి—(తనలో) ఈమాట నిజవే. ఇందులో యేమీ సందేహంలేదు. (ప్రకాశముగా) ఇటుసూడు. శ్రీహరీ! మేళంలో మీ అమ్మాయిని సూసినకాడినుంచి యికారంవుట్టింది. కానివద్దామంటె యాపారంతొందరసేత రాలేదు. ఇంకోరహస్యం. యేవిటో యాపారాయన మధుచూధనపంతులు వుంటాడు. కసింతజాడ తెలిసిందంటే నాపరువు నిలువునా తీశేస్తాడనికూడా సందేహించాను. (తనలో) ఒకవేళ నే నిక్కడవుండగా అతడొచ్చాడంటే కొంపమునుగుతుందే. ఆడు మాసెడ్డోడు. మక్కిలిరగతంతాడు. అంతగా అతడొస్తే యీళ్ళు నన్నెక్కడో దాసేస్తారు. (ప్రకాశముగా) అయినా! నాకాభయవేలేదు. మీపంతులు నాకు అర

సంచిరూపాయ లియ్యాలి. అది తీర్చిసావలేదు. ఇంకా అప్పు కావాలని నాల్గురోజులకింద టొచ్చి అడిగాడు.

సుబ్బ—(శ్రీహరినిఁజూచి) పెద్దమ్మా! నల్లమందు లేదంటివే. డబ్బిస్తే మనరామన్న బజారెల్తాడు.

శ్రీహ—ఎక్కడనుండి డబ్బు తెచ్చియివ్వను. రామన్న యిప్పుడే బజారు వెళ్ళునా?

సుబ్బి—అత్తమ్మకు నల్లమందు లేదా యేంటి; ఈపాడలనా కెందుకు సేశావు?

శ్రీహ—బాబూ! పెద్దమనుష్యులు మీరు, మీతోఁజెప్పఁగూడదు ఏమిటో పెద్దముండను కాస్త నడుమునకు పట్టుగా వుంటుంది.

సుబ్బి—ఇదిగో! ఈరూపాయిచ్చి మందు తెప్పించుకో (అని రూపాయ యిచ్చును.)

శ్రీహ—(పుచ్చుకొని) అల్లుడుగారు కోమటులలో జన్మింపవలసిన వారు గారు. (చింతామణినిఁజూచి) నీ పనుదినమును సుబ్బిశెట్టి గారు, సుబ్బిశెట్టిగారని స్మరించుచున్నందులకు నీభాగ్యవశమున నాయన నేడు వచ్చినారు. ఆయనచిత్తము, నీభాగ్యము.

(నిష్క్రమించును.)

చింతా—సుబ్బలక్ష్మి! వెండిపళ్ళెములో నిన్నియాకులు, వక్కలు మొదలగునవి వేసి తీసికొనిరా! అత్తరుసీసా కూడఁ దెమ్ము.

(సుబ్బలక్ష్మినిష్క్రమించి వెంటనే పళ్లెముతోఁ బ్రవేశించును.)

సుబ్బి—(తనలో) అతర్వ నాకు రాస్తుంది కావోసు! రాయకముందే వొళ్ళు దడదడమంటూవుంది. సెయి తగిలిందంటే కంపరం సెప్పనా?

సుబ్బ—(సుబ్బిసెట్టినిఁజూచి) బావయ్యగారి కదేమిటి! వంటిమీదంతా తామరాయేంటి? బాగా గోకి నిమ్మకాయ పుల్చెట్టించ లేకపోయారు?

సుబ్బి—ఓయమ్మో! మంటకి సావడవే. మంచిమందె సెప్పావు.

చింతా—(సుబ్బలక్ష్మినిఁ జూచి) అది తామరయనరాదు. అది వైశ్యులకుండు సిరి.

సుబ్బి—మంచిమాటన్నావు. మెట్టిమొగం దీనికేం తెలుస్తుంది.

(తెరలో)

సుబ్బలక్ష్మి!-సుబ్బలక్ష్మి!

సుబ్బి—(తనలో) పీడవదిలింది.

చింతా—(తనలో) వంటినిండ తామరయు, జేతులకుఁ దీటయు గలిగి కబంధునిచందమున నొప్పుచు, శరీరచ్ఛాయయందు గాకినే మేలనిపించుచు, భరింప శక్యముగాని గబ్బువాసనతో నొప్పు చున్న యీతఁడొక విటుఁడు. ఇట్టి వారికొఱకే కాబోలు, భగవంతుఁడు వారాంగనల సృజించినాఁడు. ఛీ! ధనమునకై యెట్టి నీచకార్యము సేయవలయును!

సీ. కుంటియైనను లేక ♦ గ్రుడ్డియైననుగాని
సందియంబును వీడి ♦ పొందవలయు
కుష్ఠుఁడైన, మఱియుం ♦ బష్ఠుఁడైనను సేవ
గింపక వేడ్కర ♦ మింపవలయు
కడు నీచుఁడైనను ♦ ధాత్రాధీశునకుఁ దుల్యుఁ
డవటంచుఁ గడు బొగ ♦ డంగవలయు
రూపహీనుండైన ♦ రూపవంతుఁడవంచు
బ్రియవాక్యములను మె ♦ ప్పింపవలయు
తే. గీ. యెట్టి రోతకైనను నోర్చి ♦ యెనఁగవలయు
గాక యుండిన ధనమెట్లు ♦ గలుగు? వెలప
డంతియై పుట్టుకంటె వ ♦ నాంతమందు
జెట్టుగా జనించుటయె మం ♦ చిదగుఁగాదె.

సుబ్బి—సింతామణీ! మాఁలోశిస్తుండావే. సిగ్గుపడుతుండావా యేంటి. సిగ్గక్కఱలేదు. సుబ్బిశెట్టి నీవోడే. ఈమూల సూస్తావుగా, యీపారాయన సరసవెల్లా వుంటుందో, కోమటాయన సరస వెల్లా వుంటుందో.

చింతా—(తనలో) నీవాడనేయని చెప్పినవారిదివఱ కెంతమంది కలరో! ఈతనియొద్ద సరసత్వమున కేమియు లోపములేదు. (ప్రకాశముగ) సెట్టిగారికి యీనాటికైన నామీద దయవచ్చినదికదా! మాభాగ్యము పండినట్లే.

సుబ్బి—కాంతా సెడగొట్టుకోకుండావుంటే నీయిల్లు పచ్చతోరణం నిత్తెకల్యాణంగా వుండదూ?

చింతా—మీదయ యుండవలెను. అనుదినమును మీరు మాయింటికి వచ్చుచుండవలయుననియే నాకోరిక.

సుబ్బి—అద్దది. మహామంచిమాట సెప్పావు. ఇహా నీకు తక్కువేవుంది. కాని, చిన్నరహస్యం. పంతులుండడు మఱి!

చింతా—ఉండనిండు. మీకంటె నాకాతండెక్కువా?

సుబ్బి—అయితే యీడ్సిపాటిస్తావాయేంటి. నేసెప్పానని అనేవు సుమా! నామీదపడి యేడుస్తాడు. సరేగాని, నామీద నీకు సాలా మోహంవుందని మీయమ్మ సెప్పిందికదా! నిజవేనా?

చింతా—నిజమోయని సన్నడుగుచుంటిరా? చూడుడు ఆపేక్ష యున్నదో లేదో. (నెనురకణతలయొద్ద మెటికలు విఱచును.)

సుబ్బి—(సంతోషముతో) నిజమే నిజమే. యేళ్ళిరిగాయి. ఆపేక్ష వుంది. ఎందుకింత ఆపేక్షవుండాలి?

చింతా—మీరు రసికాగ్రేసరులు. సుగుణవంతులు. చేసినచో స్నేహము మీతోడనే చేయవలయును. తక్కినవారు మీకాలిగోరునకుఁ బోలరు.

సుబ్బి—(సంతోషముతో) అబ్బో! అబ్బో! దీనికి నేను నచ్చాను. వహవ్వా! నాపుణ్యం పండింది. యెదవడబ్బు పోతేనేంగాక! సరసంసేస్తే దీంతోటే సెయ్యాలి.

చింతా—(సమీపించి) శెట్టిగారి కత్తరువు వ్రాసెదను. (వ్రాయుచున్నది.)

సుబ్బి—ఓహోహో! సంతోసం పట్టలేకుండావున్నాను. శరీరం

ఝల్లుమంటూవుంది. సింతామణీ! అత్తర్వ్యాకంపు మహాపరిమళం గానేవుందిగాని, యెట్లాగైనా, వుల్లిపాయపుల్సోసనకు సాలదు.

చింతా—(నవ్వును)

సుబ్బి—(పరవశుండై) ఏన్నవ్వు! ఏన్నవ్వు! బుగ్గలు సిదిపి పప్పాశారులో యేసి కాసెయ్యబుద్దేస్తుంది.

చింతా—(తనలో)

తే. గీ. విటులు వెలకాంతచే సెడి ♦ ప్రియములకును
నుబ్బి తబ్బిబ్బుజెందుచు ♦ నోడలుదెలియ
నట్టి మోహాబ్ధిలోమున్గి ♦ తుట్టతుదకు
బిచ్చమెత్తుకొందురు గదా ♦ పృథ్వియందు.

ఇవిగో! ఆకులురాసితిని. తాంబూలము వేసికొనుఁడు (పళ్లెము ముందుఁబెట్టును.)

సుబ్బి—"అలవోటులే నౌపూసనం చేసుకొంటే మూతిమీసాలు కాలినాయంట" పొద్దల్లా కొట్టుమీదకూసుండేవాణ్ణి తాంబూలవలవా పెట్టావుంటుంది. నీదగ్గఱకు వచ్చానుకదా నెమ్మళం మీ దలవాటుసెయ్యి. దీనిమాటకేంగాని, పళ్ళెంసాలాపెద్దదే. ఇంత పెద్దపళ్ళెం యేబోగందానికుంది? ఇది పంతులు సేయించిందేనా యేంటి?

చింతా—గట్టిగా మాట్లాడకుఁడు.

సుబ్బి—(భయముతో) పంతులుండాడా యేంటి. సెప్పు. సెప్పు. ఎనకదాచినావా యేంటి కొంపదీసి. నాకు యీపుమీద తాసా మర్పా వాయిస్తాడు. మా సెడ్డోడు.

చింతా—(తనలో) ఎంత ధైర్యచిత్తముగలవాఁడు. (ప్రకాశముగా) సెట్టిగారూ! భయమందవలదు! మీ ప్రాణమునకు నా ప్రాణ మడ్డువేసెదను.

సుబ్బి—అదీమాట.

(తెరలో)

అమ్మాయీ!

చింతా—మా అమ్మ పిలుచుచున్నది.

సుబ్బి—(తనలో) శనిగొట్టుముండ.

శ్రీహరి—(ప్రవేశించి చింతామణిచెవిలో నేదియోచెప్పి నిష్క్రమించును.)

సుబ్బి—తల్లీకూతుళ్ల రహస్యాలు నన్నుగురించేనా యేంటి.

చింతా—సెట్టిగారు! మీ రీదొడ్డిత్రోవను నరుగుడు. పంతులు వచ్చుచున్నాడట. రేపు మీరు తప్పక దయచేయుడు. రాక పోయినచో నన్నుం జంపుకొని తినినట్లే.

సుబ్బి—నువ్వొట్టెట్టుకోవద్దు. నేను సచ్చినట్లే. అమ్మతోడు వస్తాను. (నిష్క్రమించును.)

చింతా—(తనలో) ఎందుచేతనోగాని నేడు నాయెడమకన్ను మిగుల నదరుచున్నది. పురుషులకు గుడికన్నును స్త్రీలకెడమకన్నును నదరినచో నేమో శుభంబులొదవునని పెద్దలుచెప్పుదురు.

తే. గీ. మదినిం బరికింపగా, వెల ♦ మగువగృహము
నిత్యశోభనలీలకు ♦ నిలయమగుచు
వెలసి, ధనమునెప్పుడు గుడి ♦ పించునట్టి
వైశ్యునిదుకాణమని తల ♦ పంగవలసె.

(ఎదుటజూచి) అడుగో! మధుసూదనుడు దొడ్డిత్రోవను వచ్చుచుండెనేమి? ఈతడెప్పుడును నీదారిని రాలేదే. నావిషయమై యీతనికేమైన ననుమానముగలిగి యిట్లు జేసియుండునా? సుబ్బిశెట్టిని దొడ్డిత్రోవను బొమ్మంటిని. ఒకవేళ నీతడాతనిని జూచియుండలేదుకదా! చూచి యనుమానమందియే యుండునుగాక! నన్నేమి చేయగలడు? చేత రొక్కముతేని వీని కెట్లో నేడో రేపో సాగ్గం జెప్పందలంచియే యుంటిని. అదియుం

గాక, యీతని హృదయమున కనుమానముగలుగకుండ నేఁజేయఁ జాలనా?

తే. గీ. ఉంచుకొనువాని మఱుగున ♦ నువిద దుష్కృ
తంబుల నొనర్చి వాని చి ♦ త్తమున కేమి
సంశయము గల్గకుండఁగ ♦ సల్పజాలు
నన్నృతములకు బాసలకును ♦ నాటపట్టు
గాదె వేశ్యమానసము జ ♦ గంబునందు.

ఇదియొక పెద్దకార్యముగా నేను యోచింపనేల!

తే. గీ. సకలవిద్యల నేర్చిన ♦ జ్ఞానమెల్ల
మంటలోఁగల్పి, మానాభి ♦ మానములను
విడిచి, విటులకు మానంబు ♦ విక్రయించు
నే నసత్యమాడఁగ భీతిఁ ♦ బూననేల?

(మధుసూదనుఁడు ప్రవేశము.)

మధు—(తనలో) సుబ్బిశెట్టి నేఁడీగృహంబున కేలవచ్చెనోగదా చింతామణినిమిత్తమే యైయుండునా? ఈతఁడు రహస్యవృత్తిని బ్రవేశించుటకు రానివాఁడేని దొడ్డిత్రోవ నేలపోవలయును? ఏమో! నామనంబున నించుకయనుమానము గలుగుచున్నది.

సీ. పరిమళద్రవ్యంబు ♦ పైరోత జనియించి
నీరుల్లిపై వేడ్క ♦ నిలిచెనేమొ
వివిధమృదూక్తులు ♦ వెగటుగాఁగనిపించి
గార్దభస్వరకాంక్ష ♦ గలిగెనేమొ
హాటకామలకాంతి ♦ యతికటువుగదోచి
తామరపైఁ గాంక్ష ♦ తగిలెనేమొ
సన్ననికాయ మ ♦ సహ్యమై స్థూలదే
హాలింగన భ్రాంతి ♦ యలరెనేమొ

తే. గీ. యతిసుగంధ లేపనముపై ♦ నాసవిడిచి
మురికికంపుపై చిత్తంబు ♦ మురిసెనేమొ

కోరమీసముల పయినఁ ♦ గోర్కెపోయి
బోదకాళులపై బుద్ధి ♦ పోయెనేమొ.

(చింతామణిని సమీపించును.)

చింతా—(లేచి) రండి!

మధు—(ఆసీనుఁడై) సుబ్బిసెట్టి వచ్చెనుకాబోలు. కాసులు, మొహరీలును కుంచముతోఁ గొలిచెనా? మానికతోఁ గొలిచెనా? కొలిపించుకొనునప్పుడు నీవు మిగుల జాగ్రత్తతో నుండవలయును. కోమటులు కొలతలోఁ గొంపదీసెదరు. వారియొద్ద రెండురకముల కుంచములుండును. పిచ్చికుంచము, మంచి కుంచము.

చింతా—(తనలో) నే ననుకొనిన ట్లీతఁ డనుమాన మందినాఁడు.

తే. గీ. కల్ల కపటంబులను తరం ♦ గముల చేత
బరగు మోహవారాశిలో ♦ పలనుమున్గి
ధనమునిచ్చి కామముదీర్చు ♦ కొనెడి విటుఁడు
గణిక పరులతోఁగూడుటఁ ♦ గాంచెనేని
బొగులునదియేమొ తనకొంప ♦ మునిగినట్లు.

(ప్రకాశముగా) పంతులుగారూ! మీ చమత్కారవాక్యములు నాకంతమాత్ర మర్థముగాకపోవు. మీయనుమానము నాకుఁ దెలియును. సుబ్బిసెట్టి నాకేల కాసులును మొహరీలును నొసంగును?

మధు—మోహముచేత.

చింతా—అవునవును. మీరిట్టి యనుమానపు మనుష్యులని నాకు దెలియును. నాహృదయము మీకుఁదెలియదా? ఎంతమంది రాజాధిరాజులువంటివారు పాదాక్రాంతులై బ్రతిమాలినను నిరాకరించి, యింతకు పూర్వము నాయభీష్టములన్నియు దీర్చుచున్న మహనీయుల బోఁద్రోసి, యెంతవేశ్యనైనను బాపము నకుఁ గొంతవెఱచి, మీయందున్న యనురాగముచే మీకు

గట్టుబడి యుండుటచేతనే మీరి ట్లనఁగలిగితిరి. మిమ్ముల నమ్ముకొని యుండుటచేతనే మాయవస్థ యిట్లున్నది. మాయమ్మచేఁ జీవాట్లు దినలేక చచ్చిపోవుచున్నాను. మీ రరుదెంచినంతనే నే నెక్కడ ధనమడిగి పోవుదునాయని యిట్లు వలికితిరని తోఁచుచున్నది.

మధు—(తనలో) నిశ్చయముగా దీనికి నాయందు వలపధికము.

తే. గీ. ఎందఱెందరు చనుదెంచి ♦ సుందరదన!
మమ్ముఁగూడుము కూడిన ♦ మాన్యమిత్తు
మనుచు యాచించియుండిరి ♦ యతిన వారి
గడ్డిపోచగ గనబె నా ♦ కారణమున.

వేశ్యలలో నింత యనురాగమున్నవారి నెందును జూచియుండ లేదు. (ప్రకాశముగా) చింతామణీ! ఆగ్రహింపకుము. సుబ్బిసెట్టి యిక్కడకు వచ్చినాడా లేదా?

చింతా—రాలేదని యెవ్వరుచెప్పినారు. వచ్చినాఁడు. ఆతఁడు వచ్చినంతమాత్రముననే మీరి ట్లనుమానమందవచ్చునా? ఇట్టికులములోఁ బుట్టుటంజేసి నేను మీ కెంత చులక నయితిని.

మధు—ఆతఁడు దొడ్డిత్రోవను బోవునంతటి యవసర మేలవచ్చెను?

చింతా—అట్లడుగుఁడు. ఆతనిబంధువుల గృహంబులలో నేదేయూరనో వివాహము జరుగునట. ఆ సందర్భమున మేళమునుగూర్చి మాటలాడుటకై వచ్చినాఁడు. నాకడక రుదెంచి యడుగఁగా, నాకిదియంతయుఁ దెలియదు. పెద్దది మాయమ్మ యున్నది. దానినడుగుఁడని చెప్పితిని. మాఅమ్మ పెరటిలో బూలమొక్కలకు నీరుపోయుచున్నది. ఆతఁ డక్కడకు వెళ్ళిమాటాడి, మరల వీధిగుమ్మమువరకు బోనేలయని పెరటిత్రోవను బోయియుండెను. ఇంతమాత్రమునకే మీ కనుమానమా! ఇట్లయిన నేనేమి మీతోఁ గాపురము సేయుదును. ఇంతనమ్మకము లేకున్న నెట్లు? అసలు నే నీవృత్తియేమాని భగవంతుని ధ్యానించుచు దనువు

వెళ్లఁగోరఁదలఁచుచున్నాను. ఇంక మీసంగతి నేటితో దెలిసినది.

మధు—(సమీపించి)

మ. కనుబొమ్మల్ ముడివేసి కన్నులను ర ♦ క్తచ్ఛాయఁగల్గించుచున్
గనినన్ నేను భరింపఁగాగలనె స ♦ త్కారుణ్యమున్ బూని; నే
నను వాక్యంబులకున్ క్షమించుచు సము ♦ ద్యత్ప్రీతిఁజేకూర్పు మ
వ్వనజాతాంబకుఁడేయు సాయకములన్ ♦ వారించి చింతామణీ.
సరసమున కనిన నింతకోపమా!

తే. గీ. ముక్కుచివఱ నింతటికోప ♦ మున్న నెట్లు
దాళగలవాఁడ నేనును ♦ దరుణిమిన్న
భవ్య భవదీయ కరుణకుఁ ♦ బాత్రుఁడనగు
నన్ను నాదరింపవలదె వన్నెలాఁడి.

చింతా—(తనలో) ఈవిటులచర్యలు నాకు నవ్వుఁబుట్టించును.

తే. గీ. వారలేదైన నన్నుచో ♦ వారనారి
భావమున గిన్కదాల్చిన ♦ భంగిఁదోఁచి
యప్రియంబులు బలికిన ♦ నవ్వి సైప
లేక యిట్లు ప్రతిమాటలుచే ♦ గాక కాళ్ల
బిసుకమన్నఁ బిసికెదరు ♦ విటులు భళిర!

సరసమన్న నిట్టిమాటలాడుటా ! నాహృదయము మీరెఱుగరా.

మధు—రమణీ! నీయనురాగము నాకుఁదెలియదా! నీవు లోకములో
వేశ్యలతోఁబాటుదానవుగావు.

చింతా—అందులకనియే యట్లంటిరి.

మధు—అబ్బా! ఆవాక్యమునే యస్తమానము సాగదీసెదవేల?

చింతా—పంతులుగారూ! మీరరిగిన ధనమువిషయములో సఫలీ
కృత మనోరథులై తిరా?

మధు—అయినట్లే.

చింతా—చేతి కందినదా?

మధు—అందలేదు. కాని మనకిక నావిషయములో నేమాత్రమును సందియముండదు.

చింతా—మీరెప్పుడును నిట్లే చెప్పుచు గోడమీదిపిల్లిచందమున దాటుచుందురు. మీ మాటయందొక సత్యమైనను గానిపించుట లేదు.

మధు—(తనలో) ఈపలుకులయం దసత్యమేమియును లేదు.

తే. గీ. వేశ్యమాతలైనను లేక ♦ వేశ్యలైన
సర్థముంగూర్చి యడిగిన ♦ యప్పుడెల్ల
నిదిగొ యదిగోయటంచును ♦ నెంతొ ముదము
గలుగ; ననృతవాక్యంబులఁ ♦ బలుకుచుంట
విటుల లక్షణమే కదా ♦ పృథ్వియందు.

(ప్రకాశముగా) ఇంక నావిషయములో నీవు సందియమంద నవసరము లేదు. నాకొక యాప్తమిత్రుఁ డొకఁ డూడినాఁడు.

చింతా—సరే. ఇదివఱ కిచ్చెదనన్న మిత్రులిచ్చి యుండిరిగదా. ఇంక నీతఁడిచ్చును; మీరు పుచ్చుకొందురు. ఇదివఱకు లేని యీ మిత్రుఁడిప్పు డెక్కడనుండి వచ్చినాఁడు?

మధు—నీవును నాతని వినియేయుందువు. బిల్వమంగళుఁడు.

చింతా—వాసుదేవమూర్తిగారి కుమారుఁడా యేమి? ఆతఁడు మీకు స్నేహితుఁడా! ఒకసారియైనను నాకీసంగతి జెప్పియుండలేదు.

మధు—చెప్పిన నేమిచేయుదువు?

చింతా—అట్టి యఖండలక్ష్మీసంపన్నుఁడు మీకు హితుఁడై యుండెను గదాయని సంతోషించెదను.

మధు—ఇప్పుడుమాత్రము మిగిలినదేమున్నది. వినుము. ఆతఁడును నేనును నొక గురునియొద్దనే విద్య నభ్యసించితిమి. చదువు మానినతరువాత, నొకరికొకర మింతవఱకును గలిసికొనలేదు. నేఁడు తలవనితలఁపుగా నాతనిని నేను జూచుట తటస్థమైనది. ఆతఁడు నాయెడలఁ జూపిన చిరతరాబాల్య సఖితస్నేహవాత్స

ల్యము జెప్పదరము గాదు. ఆతనివలన నాయిబ్బంది తీరునని ధైర్యమున్నది.

చింతా—వాసుదేవమూర్తిగారు కుబేరునితోఁ దుల్యుడని నేను విని యుంటిని. కాని, బిల్వమంగళుఁడు తండ్రిచాటువాఁడుకదా!

మధు—ఆసంశయ మక్కరలేదు. వాసుదేవమూర్తిగారు వ్యవహార భారమంతయు నీబిల్వమంగళునిపై వేసినారు. అన్నిటికిని నితఁడే స్వతంత్రుఁడు. ఈరోజుననే యాతనిని నేను గలిసికొని యుండుటచే మనవిషయమై యేమియు ముచ్చటింపకవచ్చితిని. మరల నేను రేపాతని యొద్దకరిగి వలసిన ధనమడిగెదను. వాత్సల్యమునంజేసి నేనడిగినదే తడవుగా నాతఁడిచ్చితీరును. వానికున్నంత ధన మీయూర నెవరికిని లేదు.

చింతా—ఆతనివలన మీకు ద్రవ్యము లభ్యముకాగలదని ధైర్యమున్నది. (తనలో) బిల్వమంగళుఁడు విద్యయం దపరసరస్వతి యనియు, రూపమున మన్మథుండె యనియు, నైశ్వర్యంబునఁ గుబేరుఁడనియు వినియున్నాను. ఆతనితో మైత్రిజేయుటకు నాకుఁ గుతూహలమగుచున్నది. కాని, నాయభిప్రాయము నానంతయు బయలుపెట్టక, చిత్రముగా నీకార్యమునందు మధుసూదనునినే నియోగించెదగాక. [ప్రకాశముగా] పంతులుగారూ! మీయందున్న యనురాగముచేత నీయదలచినచో నా బిల్వమంగళుఁడు మీకెంత ధనమైనను నొసంగఁగలఁడ కాని యీవిషయంలో మీకు నేనొక సంగతిఁ జెప్పదలఁచి నాను. నేజెప్పినట్లు మీరు చేసెదనని చెప్పినచో వచించెదను.

మధు—చింతామణీ! ఎప్పుడైనను నేను నీమాటకన్యథా వచించితినా!

తే. గీ. సత్యభామకుఁ గృష్ణుఁడే ♦ సరణి నతివి
నమ్రుఁడై యుండెనో యట్లె ♦ నాతినీకు
నేవిధేయుండ నంచును ♦ నీదుమదిని
దలఁచి వచియింపదగుసుమీ ♦ తథ్యముగను.

చింతా——పంతులుగారు! మీకు బిల్వమంగళుఁడు స్నేహితుఁడని చెప్పితిరికదా! ఆతని నెట్లయిన నుపాయముజేసి యిక్కడకు గొని రాఁగలరా?

మధు——(తనలో) ఏమిది! ఇది యిట్లగుచున్నది. బిల్వమంగళునిపై నేమైన భ్రాంతి పొడమినదా యేమి' (ఆలోచించి) కాదు కాదు, లేనిపోని యనుమానమును నామనంబున బ్రవేశింపనీయ రాదు. ఈచింతామణి హృదయము నేను సంపూర్తిగ నెఱుంగుదును. నేను దీనియింట నడుగు బెట్టినది మొదలిది యన్యులను గన్నెత్తియైన చూడలేదు. (ప్రకాశముగా) చింతామణీ! ఆతనిసంగతి నీవు పూర్తిగా వినియుంటివో లేదో! ఆతఁడు సకలశాస్త్రములును నభ్యసించిన మహాపండిత చక్రవర్తి. ఆచారసంపన్నుఁడు. సద్గుణములన్నియు నొక ముద్దగాజేసి యాతనియందు బితామహుఁడుంచినాఁడు. పరనారీ సోదరుఁడని చెప్పవలసి వచ్చినపు డాతనినే చెప్పవలయును. అట్టివాఁడు వేశ్యాగృహంబు నెట్లు ప్రవేశించును? ఈవిషయము కొంచెము సందేహమే! అయినను నాతఁడియ్యెడ కరుదెంచినందువలనఁ బ్రయోజన మేమియున్నదో చెప్పితివి కాదు.

ంతా——ఈరహస్యము మీచిత్తమందే యుంచుకొనుఁడు. ఆతఁడు మహాధనవంతుఁడని మీరే నుడివియుంటిరికదా! మీ రేపన్నుగడమీదనైనను నాతని నిక్కడకుఁదోడ్కొని వచ్చితిరా మీభాగ్యము ఫలించినట్లే భావింపుఁడు. మీదగ్గఱనున్న ధన మయిపోయినది. ఈవిషయములో మాఅమ్మ నన్ను రంపపుకోఁత కోయుచున్నది. మీ మీఁదనున్న మోహముచేత మిమ్ము నేను విడువలేక యున్నాను. ఆబిల్వమంగళుఁడు మనయింట నడుగుబెట్టినఁజాలు. మీకు ధనము చేకూరినట్లే భావింపుఁడు. మనమిరువురమును స్వేచ్ఛగ సుఖింపవచ్చును. బిల్వమంగళునియొద్ద నున్న ద్రవ్యమంతయు మీరును నేనును ననుభవించు మార్గము నేఁజేసెదను. ఆతనియెడల నడపవలసిన

మాయతంత్రమంతయు నే నడిపెదను. కాని, మీరుమాత్ర మాతనియొద్ద నెట్టి చమత్కార వాక్యములాడి, యాతని హృదయము నాకర్షించి యిచ్చుటకుఁ దోడ్కొని వచ్చెదరో, యా విషయమునమాత్ర మతినిపుణతతోఁ బ్రవర్తింపవలయును!

మధు—చింతామణీ! నీవుచెప్పిన యుపాయము కడుఁ జక్కగనే యున్నది. కాని,

సీ. సకలవిద్యా రహ ♦ స్యంబులనారసి
యమరగురునిమించి ♦ యలరువాఁడు
నిరతంబు శ్రీరమా ♦ వరపాదకమల సే
వాసక్త చిత్తుఁడై ♦ బరగువాఁడు
పరకాంతలను మాతృ ♦ భావంబుతోఁ జూచి
వినతులర్పించుచు ♦ వెలుగువాఁడు
కలనైన మఱియున ♦ వ్వులకైన నిసుమంత
బొంకి యెఱుంగక ♦ పొలుచువాఁడు
తే. గీ. ధర్మమే జయంబనుమాటఁ ♦ దలఁచి యెపుడు
గురుజనంబులఁ బూజించి ♦ వరలువాఁడు
నపరశుకుఁ డను పేరున ♦ నమరువాఁడు
నైన బిల్వమంగళుఁ డెట్లు ♦ లరుగు దెంచు?

అందులో వేశ్యయింటి కరుగుదెంచునా?

చింతా—మీసామర్థ్యము, చమత్కారమును జూపవలయును.

మధు—ఒకవేళ నాచమత్కారవాక్యములకు లోనై యిచ్చ్యోడకరు దెంచుఁగాక! ఆతఁడు నీవాక్యముల కలరుటెట్లు?

చింతా—పంతులుగారూ! మీ రాతనింగూర్చి విశేషము చెప్ప నక్కరలేదు.

ఉ. ఇంత వచింతువేల విను ♦ మీ! పలుమాటలు బల్కనేల, తా
నెంతటి శిష్టుఁడైన మఱి ♦ యెట్టి తపోనిధియాచు నొప్పినన్

గాంతలఁ జూచినంతటనె ♦ గాముని బారికిఁజిక్కి దాసుఁడై
యింతికి సంచరింపఁడె మ ♦ హీతలమందున నీవెఱుంగవో?
మధు—బిల్వమంగళుఁడుమాత్ర మట్టివాఁడు కాడని నాయభిప్రాయము.
చింతా—మీరు చెప్పినది కేవలము వెఱ్ఱిమాట.

సీ. తాపసోత్తముఁడయ్యు ♦ దాశ కన్యా కేళి
సల్పిన ఘనపరా ♦ శరునికంటె
సతినిష్ఠవీడి కా ♦ మాంధుఁడై మేనక
జేరినయట్టి కౌ ♦ శికునికంటె
సువిదలఁజూడకే ♦ యుండి వేశ్యల వెంట
బడిన విభాండకు ♦ కొడుకుకంటె
నాచారవంతుఁడై ♦ యలరియు, విధవల
మఱిగిన యలవ్యాస ♦ మౌనికంటె
తే. గీ. బరమనైష్ఠికుఁడా! నిరం ♦ తర తపోర
తుండ! యీమాట లింకేల ♦ తోయజాక్షు
లం గనినయంత నీవు వి ♦ నంగలేదె
బ్రహ్మకైనను బుట్టును ♦ రిమ్మతెగులు.

అతఁడు మనకు వశుఁడగునట్లు చేయుభారము నాది. మీ రెట్లయినను దోడ్కొనివచ్చుటకుఁ బ్రయత్నము సేయుఁడు. వేపారులకు యుక్తు లొకరు చెప్పవలయునా?
మధు—కానిమ్మా. నా కీకార్యములో ముఖ్యప్రాణదేవుఁడు తోడుపడకుండునా?

(తెరలో)

చింతా—మాఅమ్మ పిలుచుచున్నది. మీరికఁ బోయిరండు. శుభమగును. (నిష్క్రమించును)
మధు—(తనలో) బిల్వమంగళునిఁ దనకడ కెట్లయినఁ దోడితెమ్మని నన్నే నియోగించినది. ఇందేమయినఁ బరమరహస్యమున్నదా?
ఇంతబ్రదుకు బ్రదికి, యిట్టిదౌత్యమును నేను జేయవలయునా? ఛీ!

ఏమిబ్రదుకు. ఏమైననుసరే! నే నిట్టికార్యము సేయును. ఇయ్యది గౌరవభంగమైనపనికాదా! (ఆలోచించి) కాదు! కాదు! చింతామణిహృదయము నిష్కల్మషమైనది. ఎట్లయినను బిల్వ మంగళునిఁ దనయొద్దకుఁ దీసికొనివచ్చినచో, నాతని నెట్లయిన మాయపుచ్చి యతనివలన ద్రవ్యముగైకొని, నాతో సుఖింప వచ్చునని యే చింతామణితలంపు. నాయొద్దధనము లేదని శ్రీహరి దానిని దూపించుచున్నదని, యెట్లయిన నన్ను, బాయకుండు ట కీతంత్రము పన్నినది. కానిమ్ము ఎట్లయినను బిల్వమంగళుని నియ్యెడకుఁ దెచ్చెదగాక! చింతామణి చెప్పినదంతయుఁ జేసితీ రును. బిల్వమంగళుని మాయలోఁబడవైచి కైకొనినధనముతో నేనును, జింతామణియు హాయిగ సుఖించెదము. ఇప్పుడీకార్యము నేను జేసినందువలన నాకు వచ్చెడిగౌరవహాని యేమున్నది?

సీ. అగ్నిసాక్షిగఁగొన్న ♦ యతివల విడనాడి
వేశ్యలంగూడుచు ♦ వెలయువారు
ఉద్యోగమాసించి ♦ యువిదల నధికారి
పొందుకై పంపించి ♦ పొలుచువారు
వేశ్యనుంచియు వేడ్క ♦ విత్తమార్జింపంగ
భర్తలజేకూర్చి ♦ బరగువారు
వ్యామోహమును వార ♦ వనితను విడలేక
దాసానుదాసులై ♦ తనరువారు
తే. గీ. తిట్టినను గొట్టిననుగాని ♦ రట్టుపెట్ట
కుండ నీవె దిక్కని పడి ♦ యుండువారు
గలరు లోకంబునందుఁ బె ♦ క్కండ్రు, వార
లందు నేఁగూడ నొక్కండ ♦ నగుదుగాదె.

ఇంక సంశయింపక బిల్వమంగళుని కడకేగెదను.

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.




# చతుర్థాంకము.

[బిల్వమంగళుని యారామభవనము:—(ప్రవేశము,)
సంభాషించుచు, బిల్వమంగళుఁడు - మధుసూదనుఁడు.]

బిల్వ—మిత్రమా! మధుసూదనా! నీవు చెప్పినదానిలో నతిశయోక్తి యున్నది. ఇది యెంతమాత్రమును విశ్వసింపఁదగిన విషయము కాదు.

మధు—చింతామణి విషయమున మాత్రమెవ్వరును నట్లు దలంపరాదు. అది నిశ్చయముగాఁ జింతామణి యనియే నాయభిప్రాయము.

బిల్వ—విటులపాలిటికా!

మధు—బిల్వమంగళా! నీవు మహాపండితుఁడవు. నీతో నెవ్వఁడు భాషింపఁగలఁడు?

బిల్వ—నీవు చెప్పినది లోకవ్యవహారమునకు దూరము.

తే గీ. కాకిజాతియందు తెలుపు ♦ గణికకులము
నందు నిక్కమౌ వలపు శి ♦ వార్చనార

తునకు విష్ణుదేవుకొలుపు ♦ ధనము కొఱకు
లంచముల మేయు నధికారి ♦ కంచితమగు
న్యాయమంనుదలఁపు; మన ♦ మరయలేము.

మధు—నీవు చెప్పినట్లు వేశ్యకు నిక్కమైనవలపుండదు. కాని యీ చింతామణినిమాత్రము తక్కిన వారాంగనలతోఁ బాటుచేర్చ రాదు. అదిసామాన్య వారాంగనకాదు.

సీ. భరతశాస్త్రంబు, స ♦ భ్యాసంబుగావించి
యందులోమేటి ప్ర ♦ ఖ్యాతిఁగాంచె
గానంబునం దీ జ ♦ గాన దీనికి నీడు
లేరను భంగినిఁ ♦ బేరుగాంచె
యుభయ భాషాప్రౌఢి ♦ యొప్పగానార్జించి
కవయిత యాచును ♦ గణనకెక్కె
జ్యోతిషం బొకయింత ♦ చదివియందలి రహ
స్యములెల్ల గ్రహియించి ♦ యశమునొందె

తే. గీ. వ్యాకరణమందునం గూడ ♦ ప్రజ్ఞఁగాంచె
తర్కశాస్త్రంబు జవిచూచి ♦ ధన్యయయ్యె
నట్టిచింతామణి స్తుతికి ♦ నర్హురాలు
గాదె! సంశయం బేటికిఁ ♦ గాంచె దీవు.

బిల్వ—

ఉ. ఇన్నిదినాలనుండి యిట ♦ నే వసియించుచు నుంటిగాని, నే
నెన్నడు నిట్టివారజల ♦ జేక్షణ యిప్పురినుండె నంచునుఁ
విన్నదిలేదు విద్యలను ♦ నేర్చి యశంబునుగాంచెఁగా భళా
పెన్నెఱివేణు లెల్లరును ♦ నేర్చికొనందగు గాదె విద్యలన్.

విద్యావైభవమున నొప్పువా రేకులమువారైననేమి? విద్యాశారదయగు నీవుచెప్పిన యీచింతామణి వేశ్యకులమున జన్మింపక మఱియొక కులమున జన్మించియున్నచో మఱింత కీర్తి చేపట్టియుండును గదా!

మధు—అది వేశ్యయేగాని సాధ్వీలక్షణము లున్నవి. దానికిఁదోడు సౌందర్యము చెప్పనక్కఱలేదు.

బిల్వ—పాండిత్యమునకుఁదోడు సౌందర్య విశేషముగూడ నున్నదా?

మధు—సామాన్య సౌందర్యమైన నేను నీతో వచియింతునా?

సీ. పల్లవాధర వేణి ♦ బంధంబు వీక్షింప
సారంగపాళి ప్ర ♦ సన్నమగును
నబ్జాతదళనేత్ర ♦ యమలమృదూక్తుల
సరణిజూడ హరి సా ♦ క్షాత్కరించు
దిలనాసముఖరుచిఁ ♦ దిలకించినంతనే
యంబుజోద్భవుఁడు ప్ర ♦ త్యక్షమొందు
గళ్యాణి దృగ్ధాళ ♦ ధళ్యంబుఁగన మహా
నిమిష పరికాండంబు ♦ నివ్వటిల్లు

తే. గీ. రమణి పదములఁజూచినఁ ♦ గమలరాజ
గరిమ గనిపించు విరిబోఁడి ♦ గమనమెంచఁ
బరమహంసవ్రజంబు గ ♦ న్పట్టు; నింత
యేల! నలువకైనను నింతి ♦ నెన్నదరమె.

బిల్వ—నిజముగాఁ జింతామణి యెట్లున్నదో నేను జూడలేదుకాని, నీవర్ణనావిశేషమునుమాత్రము శ్లాఘింపవచ్చును.

మధు—ఇయ్యది నా వర్ణనావిశేషముగాదు. ఆలేమసౌందర్యవిశేషమే.

బిల్వ—నీవక్కాంతామణి నెందులకుఁ దిలకించితివి?

మధు—ఈమధ్య నాస్నేహితుఁడొకఁడరుదెంచి, దానిపాండిత్యమును బరీక్షింపఁ దలఁచి పోవుచు నన్నుఁగూడ వెంటదోడ్కొనిపోయెను. ఆసమయమున నేనాచింతామణిని జూచుట తటస్థించినది. నేనును, బండితమణియైన నామిత్రుఁడును జింతామణిరాకకు నిరీక్షించుచు దన్మందిరమున నొకచావడిలో మాకై యేర్పాటుచేయఁబడిన యాసనంబులయందు గూర్చుండి యుంటిమి. మిత్రమా! అప్పుడేమని చెప్పుదును!

సీ. కమలాక్షుపుత్రుని ♦ కార్ముకరసమున
సరస వాఙ్మాధురి ♦ నెరపుకొనుచు
నతను జయార్భటు ♦ లన హస్తకంకణ
క్వణనిక్వణంబులు ♦ బరపుకొనుచు
మరునివింటనునొప్పు ♦ మహితశింజినియన
మించువేణినిఁ గద ♦ లించుకొనుచు
స్మరుచేతిలోనుండు ♦ విరితూపులోయన
క్రేఁగన్నుదోయి వీ ♦ క్షించుకొనుచు
తే. గీ. హంసనడకల నడచుచు ♦ నతిముదమున
నేము గూర్చున్నస్థలమున ♦ కేగుదెంచి
మహితభక్తితోమాకు న ♦ మస్కరించి
నట్టి చింతామణినిగాంచి ♦ యద్భుతంబు
గాంచినాఁడ దత్సౌందర్య ♦ గరిమకేను.

బిల్వ—మిత్రమా! వేశ్యయయ్యు, సుగుణసంపత్తిగలదై, దానికిఁదోడు విద్యనార్జించి సౌందర్యవతియైగూడ నుండెనుగదా! నిశ్చయముగా నా చింతామణి ధన్యురాలనియే చెప్పవచ్చును. (ఇంచుక యూరకుండి) మధుసూదనా! ఎవరోపండితుఁడు నీమిత్రుఁడాచింతామణిని విద్యాపరీక్షసేయుట కరిగెనని చెప్పితివే. ఆతనిపరీక్ష కామె యాగెనా?

మధు—బిల్వమంగళా! నాస్నేహితుఁ డక్కాంతను గొన్నిప్రశ్న లడిగెను. అడిగినదే తడవుగా నన్నిటికిని సదుత్తరములిచ్చి యాతని కానందము గలుగఁజేసెను. కాని, యొక్కవిషయములో మాత్రము, ఆసంగతి నాకు జ్ఞాపకములేదు. అన్నట్లు – మఱచితిని. ఈ సందర్భమున నీపేరుగూడ వచ్చినది.

బిల్వ—అక్కడ నాపేరుకూడ వచ్చెనా! ఇది వింతగనున్నదే.

మధు—మఱేవిషయమోయని నీవు సంశయింపవలదు. నాస్నేహితుఁ డాచింతామణి నేదోప్రశ్న యడిగినాఁడు. ఆవిషయము నది యొక్కింత యాలోచించినది. అప్పుడాతఁడు "చింతా

మణీ! అపరశుకుండను పేరు వహించిన బిల్వమంగళ పండితా గ్రేసరుఁడీపురంబున నుండెనుగదా! నీవేలయాతనినాశ్రయించి యాశాస్త్ర మభ్యసింపలే”దని యడిగెను.

బిల్వ—ఆపండితుఁడు నాపేరేల నుడువవలెను?

మధు—ఇందు తప్పేమియున్నది? నీవు పండితాగ్రేసరచక్రవర్తివి గాన యాతఁడట్లు వాక్రుచ్చెను.

బిల్వ—దీనివలన నాకు లేనిపోని శ్రమయేమి కలుగునోయని సంశయించుచున్నాను.

మధు—శ్రమయేముండును? ఒకవేళ నాచింతామణి నీవద్ద నేదేని శాస్త్ర మభ్యసించుటకు వచ్చునేమో! అప్పుడు నీవు దానికి గురుఁడవై యుండుట కంగీకరించెదవా? లేదా;

బిల్వ—విద్యార్థులై యెవ్వరైనవచ్చినచోఁ దెలిసియుండియు సత్పాత్రవిద్యఁ బ్రసాదింపని గురుఁడు మహాపాపము నందగలఁడని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. అయినను, నా చింతామణి యిప్పుడింకను విద్య నభ్యసించుటకుఁ గోరునని తలంపను.

మధు—నీవట్లు తలంపరాదు. అది నామిత్రునితోఁ జెప్పిన పలుకులఁ బట్టి చూడగా, నీవద్దకుఁ ద్వరలోనే వచ్చి నిన్నాశ్రయించు నని తోఁచును.

బిల్వ—ఆహా! ఇది యొకటియా! గొప్ప చిక్కే తెచ్చిపెట్టితివి.

తే. గీ. ఎంత విద్యాప్రవీణయై ♦ యెసఁగుచున్న
గాంత వేశ్య యగుటచేత ♦ స్వాంతమందు
సందియంబును బొందెద ♦ జనులనేక
గతులఁ జెప్పకొనెదరిద్ది ♦ కలిగెనేని.

మధు—మిత్రమా! నీయొద్ద దాచనేల. చింతామణి నేఁడో రేపో నీగృహమున కరుదెంచి తాను నేర్వఁదలంచిన శాస్త్రమును బోధింపుమని నిన్నాశ్రయించి తీరును. ఈసంగతి నేను గ్రహించినాను. గ్రహించితినననేల! నీకును, నాకును మైత్రి యున్నదని యెఱింగి దాని నిశ్చయాభిప్రాయమును నాతోడనే చెప్పినది.

బిల్వ—సఖుఁడా! ఈసంగతి నీవు నాయొద్ద దాచెదవేల? నిశ్చయముగా నది యిక్కడకు వచ్చెనేని మాజనకుఁడు నావిషయమై మిగుల ననుమాన మందఁగలఁడు. నాయందు వాత్సల్యముంచి యక్కాంత నాకడకు రాకుండఁ జేయఁగలవా?

మధు—దాని యుద్దేశమును మానఁజేయుటకు నేనెట్లు శక్తుఁడనగుదును? పోనిమ్ము. నీవచ్చటికేగెదవా!

బిల్వ—ఎంతమాటఁ జెప్పితివి!

తే. గీ. బహుళ విటజనాకీర్ణమై ♦ పాపభరిత
మై; కల్లలకు నిలయ ♦ మై; దనరెడి
వేశ్యగృహమందు నడుగేను ♦ బెట్టియుంట
నీవు వీక్షించియుంటివే ♦ నేస్తకాడ.

మధు—బిల్వమంగళా! నీవు పరనారీవిముఖాంతరంగుండవనియు, నేకపత్నీవ్రతుండవనియు నే నెఱుంగుదును. కాని, నీవు చింతామణిగృహంబునకు మఱియొక దురభిప్రాయమును బూని యరుగవుకదా! విద్యావిషయపరీక్షంసకేకదా!

బిల్వ—మధుసూదనా! నీవు చెప్పినమాట నిశ్చయమే. అది వేశ్యయైనను విద్యాసంపన్నురా లగుటంజేసి యొకసారి చూడవలసినదే! అంతమాత్రముచేత నా సత్ప్రవర్తనమున కావంతయు భంగము గలుగదు; కాని,

మధు—కాని, అనియేమో సంశయముగాఁ జెప్పుచున్నావు. చింతామణింజూచుట యెట్లనియా నీయభిప్రాయము? ఎట్లయినను నది యిక్కడకే వచ్చును. నీవందులకు సందియ మందుచుంటివిగాన, విద్యాపరీక్షకై నీవే యరిగినచో బాగుండును. దీన హానియేమియును లేదు.

బిల్వ— మిత్రమా!

తే. గీ. కల్లుపాకయు సారాదు ♦ కాణము; మఱి
వెలవెలఁదియిల్లు నొక్కటే ♦ విధముసుమ్మ

సుజనుఁడైన నను నాదారిఁ ♦ జొచ్చెనేని
మూర్ఖులోకవిధమునఁ దల ♦ పోయుచుండ్రు.

అయినను నిప్పుడీవిషయమునుగూర్చి యనవసరముగా నింతగ నాలోచింపనేల? తరువాత చూడనచ్చును.

మధు—(తనలో) ఈతని నెట్లయినను జింతామణీగృహములో బ్రవేశపెట్టఁగలుగుదునని ధైర్యమున్నది. కాని నే నిప్పుడింక కేవలము వైదికునిరీతి వర్తింపరాదు. తొలుత నెట్లయిన రెండః కంటివానికిఁ దెలియకుండఁ జింతామణియే యీతనికడ కరి దెంచునట్లు చేసెదను. (ప్రకాశముగా) మిత్రమా! చీకటి పడుచున్నది. అనుజ్ఞ యిచ్చితివేని యరిగెదను.

బిల్వ—మరల మనము రేపు కలిసికొందముగాక. (ఇటునటుజూచి) మాటలసందడిలో మనము కాలమునే మఱచితిమి. సూర్యాస్తమయమైనది. నేను త్వరగా గృహంబున కరుగకపోతినేని నా తండ్రిగారు నాకై పరిపరివిధముల జింతించి మదన్వేషణమునకై బయలుదేరుదురు.

మధు—(నిష్క్రమించును.)

బిల్వ—(ఎదుటఁజూచి) సేవకా! గృహమునకు ద్వరగా బోవుదము. దీపము వెలిగించుము.

(నిష్క్రమించును.)

రంగము:—[చింతామణి - గృహమున గదిలోఁ బ్రవేశము.]

చింతా—(తనలో) ఆహా!

సీ. వరభక్తి శ్రీహరి ♦ పాదాబ్జ నవసార
సద్ధ్యాన మెవ్వేళ ♦ సలుపువాని
భూరిఛాత్ర శ్రేష్ఠ ♦ వారంబు నిరతంబు
దనుఁ బరివేష్టింప ♦ దనరువాని
విశ్వ విశ్వంభరా ♦ బృందారకాన్వయ
వారాశి చంద్రుఁడై ♦ వరలువాని

వివిధశాస్త్రార్థ సం ♦ వేదియై యలబృహ
స్పతికి దుల్యుండయి ♦ బరగువాని
తే. గీ. తన ఘన యశోలతావళి ♦ ధరణియందు
నఖిలదిక్కులందునఁ బ్రాక ♦ నలరువాని
బిల్వమంగళు దర్శించి ♦ వెలయుభాగ్య
మెదవుటెన్నఁడొ కద నాకు ♦ మదినిఁజూడ.

ఆ బిల్వమంగళునిఁ దలఁచినపుడెల్ల నాహృదయము జల్లు మనుచుండును. ఎన్నిదినములక్రిందటనో దేవాలయములో జరుగు మహోత్సవమునకు వచ్చినప్పుడు చూచితిని. నాఁటినుండియు నామనం బతనిపైఁ దగిలియే యున్నది. కాని, యవ్విషయమైన ప్రయత్నమే నేను చేయలేదు. (ఇంచుక యూరకుండి) నేను నెమ్మదిగా బిల్వమంగళుని నియ్యెడకుఁ దోడ్కొనిరమ్మని మధుసూదను నియోగింపఁగలిగితిని. నాయుద్దేశమున కాతఁ డంగీకరించెను. మధుసూదనుఁడు బిల్వమంగళునియొద్ద నెట్లుమాటలాడునో!

ఉ. ఆతఁ డనేకశాస్త్రముల ♦ నారసి పండిత సత్కవీంద్రుఁడై
ఖ్యాతినిఁ గాంచినాఁడు శుకు ♦ డంచు నుతింపఁగ సజ్జనుల్; మహా
నీతిపరుండు; సద్గుణుఁడు ♦ నిర్మలచిత్తుఁడు నట్టిచో నన్నుఁ
బ్రీతినిఁ జూడఁగాదలచు ♦ నే యవినీతిని దోచ దయ్యెడిన్.

ఇంతకును మధుసూదనుని వాక్యములపై నాతఁ డేమి చెప్పునో!

మ. వెలయాలయ్యది దానిఁ జూచుటకు నే ♦ విచ్చేసినన్ బాపమి
య్యెడఁ బ్రాప్తించును; నిట్టికార్యమున కీ ♦ వేతెంచితే యంచు దా
నలుకన్ బూని వచించునో; మదిని ను ♦ ద్యత్ప్రేమనుం బూనుచున్
లలి నన్నున్ దిలకింపరాదలచునో ♦ నాభాగ్య మెట్లున్నదో.

(శ్రీహరి ప్రవేశించును.)

శ్రీహ—(చింతామణినిఁ జూచి) అమ్మాయీ! ఎప్పుడుచూచినను

నిట్లాలోచనపెట్టికొని కూర్చున్నచో వ్యాపారమెట్లుసాగును! బాగానేవుంది.

చింతా.—ఇప్పుడు నేను చేయవలసిన వ్యాపార మేమున్నది?

శ్రీహ—మన కేమివ్యాపారములుండును. ఒకటే వ్యాపారము.

తే. గీ. వాడిపోయినట్టి తమల ♦ పాకు పగిది
వయసుగడచినచో వార ♦ వనితనెవ్వఁ
డైనజేరునె? యందుచే ♦ యౌవనంబు
నందె ద్రవ్యంబు నార్జించి ♦ యలరవలయు.

చింతా—ఈవిషయములో నేను నీమాట కన్యథావర్తించిన దేమున్నది!

శ్రీహ—నీవన్యథాఁ జేయుచుంటివని నేనుజెప్పలేదు. మధుసూదనుఁడు మరల రాలేదుకదా!

చింతా—బిల్వమంగళుని నెట్లయిన నిటకుఁదెచ్చుకార్యముమీద నాతని నియోగించితినిగదా?

శ్రీహ—ఈవిషయములో నీవు మిక్కిలిమంచిపనిఁ జేసితివి. బిల్వమంగళుఁడు నీకు వశుఁడయ్యెనా మనపుణ్యము ఫలించెనని చెప్పవచ్చును. అన్నట్లు మఱచిపోతిని, చావడిలో పెద్దమనిషినిఁ గూర్చుండఁబెట్టి వచ్చినాను.

చింతా—ఆ పెద్దమనిషి యెవరు?

శ్రీహ—ముత్యాలవర్తకుఁడు. హైదరాబాదునుంచి వచ్చినాఁడఁట. సాహేబు.

చింతా—నీవేమైన ముత్యములు వెలకుఁ దీసికొందునని పిలిచితివా యేమి?

శ్రీహ— ఆతనియెడల నీప్రజ్ఞ గనఁబఱచినచో మనము వెలకు దీసికొనవలయునా! ఆతఁడీయూరునకువచ్చి మూడురోజు లయినదఁట. నిన్నటిరోజున నుదయమున నీవు వీధిగుమ్మమువద్ద నిలఁబడియుండగాఁ జూచినాఁడఁట. ఎట్లు స్నేహము కుదిరినదోగాని రామన్న యాతనిని దీసికొనివచ్చినాఁడు.

చింతా—సాహేబు నింటఁ బ్రవేశింపనిచ్చితివా! ఎవరైనఁ జూచిన

గెలిసేయరా! ఇదివఱకుఁ జేయుచున్నపనులు చాలక మ్లేచ్ఛుల సంపర్కముగూడ గలుగజేయదలంచితివా?

శ్రీహ—నీవు చదివినశాస్త్రములందు వేశ్యలు మ్లేచ్ఛులను జేరనీయ గూడదని చెప్పబడియున్నదా యేమి?

చింతా—మనలో తుఱకలను గూడినవారిని కులమునుండి వెలి వేయుదురుకదా!

శ్రీహ—ఎప్పుడో పూర్వపుమాటలు చెప్పెదవేమి? ఇప్పుడా యాచారము నెవ్వరును పాటించుటలేదు. నీవు వింటివో లేదో. పాపాచలముగృహమునకు దఱచువచ్చుచుఁ బోవుచుండువాఁ డెవ్వఁడని తలఁచినావు? తోళ్లవర్తకముసేయు లబ్బేసాహేబే కదా? ఇప్పుడు మనమా విషయమునుగూర్చి సంశయింపఁ బనిలేదు. ఆయనను లోపలికి తీసికొనివచ్చెదను.

(నిష్క్రమించును.)

చింతా—అక్కటా!

తే. గీ. ధనమ! నిన్నువర్ణింపగా ♦ దరమె! యెంత
కైనఁ దగుదువు; నావిద్య ♦ గంగగలిపి
కులము నెంచక వేశ్యయుఁ ♦ దలపకుండ
విటులతో జరింపఁగ జేసి ♦ వెలసినావు.

[గఫార్ సాహెబుతో—శ్రీహరి ప్రవేశించును.]

శ్రీహ—అమ్మాయీ! ఈసాహెబుగారు చాలా గొప్పవారు. ముత్యాల వర్తకులు. నవాబులతో సమానులు. నీవెట్లుగౌరవించెదవో.

గఫార్—ఠీక్ బాత్.

శ్రీహ—(సాహెబును జూచి) సాహేబుగారు! మావేశ్యలలో సాధారణముగ నెవ్వరును మీతుఱకలతో సహవాసము సేయరు. మీముఖము జూడఁగనే గొప్పవారనియు, మర్యాదగలవారనియు గ్రహించి సమ్మతించినాను.

గఫార్—షత్తెం షత్తెం. మర్యాద కావాల. మన్షిమన్షి కలిసేతో డబ్బుక్యా! మనసంగతి నీకి తెల్సేతో లేదో. ఏక్ రూపాయ్

కౌడిగా ఖర్చ్ చేస్తామ్.

శ్రీహ—మీదయ, దానిభాగ్యం.

గఫార్—ఫర్వానహీ.

శ్రీహ—(నిష్క్రమించును.)

చింతా—(సాహెబునుజూచి) సాహేబుగారిచేతులో నున్నదేమి?

గఫార్—వర్తకంకా తోల్పెట్టె. దీనిమే ముత్యాలపేర్లకా సరుక్ భోత్ వుంది.

చింతా—నేను దానినిఁ జూడవచ్చునా?

గఫార్—ప్యారీ! మాకీ షందేహంలేదు. నీకు షూపిస్తాం! షూడు. (పెట్టె తెఱచి) మంచిముత్తేలకా పేరుల్ భోత్ ధరవుంటాయి.

చింతా—(ముత్యాలహారమును దీసి) సాహెబుగారు! ఈచిన్నముత్యములపేరు ఎంతఖరీదు ఉండును?

గఫార్—ఏక్ వెయ్యిరూపాయల్ వుంటుంది.

చింతా—అమ్మో! అంతధరపెట్టి మేమెక్కడకొనగలము?

గఫార్—నీకీకొనడం యేమిటి. మేము దీన్కి నీకు తగిలిపిస్తామ్. నీమీద మాకీనిండా కుషీగావుంది. (మీదచేయివేసి) మాకీ దగ్గిరగాబైటో, డర్నకో.

చింతా—(తనలో) వీనిచేతులు కాలిపోను. తాటిపట్టెలచందమున నున్నవి.

గఫార్—(ముత్యాలహారము చింతామణిమెడలో వేసి) ఇఫ్డు భోత్ ఠీక్‌గావుంది. అచ్ఛాహై. మేము భోత్ కంచెన్కు షూశాం. నీకీ మోస్తర్, దేఖేనై.

చింతా—సాహేబుగారు! మీరీయూర నింక నెన్నిదినము లుందురు?

గఫార్—మాకీ యేమీ తెలుస్తాది. సరుకు ఖర్చు అయేతో జల్దీ బషానాకట్తాం.

చింతా—మీరుమాత్రము మాయింటికి వచ్చినారన్న సంగతి యెవ్వరికిని దెలియనీయవలదు. మాకు నగుబాటుగ నుండును.

గఫార్—నీకు భయమేమి? నీకీ యెవరుయేమి చేష్తార్. ముసల్

మా౯ వాలాకు తుంమెప్పూ షూడలేద్. మాకీ చెప్పో. ఖతర్ చేస్తాము! ప్యారీ! నీమోష్తర్ కంచెన్ మాబస్తేమే వుంటే భోత్ పైసావస్తాది.

చింతా—నన్ను మీపూరికిఁ దీసికొని వెళ్ళుదురా?

గఫార్—ఆవ్. మాకీ షందేహంలేదు. నీకీ మేము తీస్కుపోయి నిఘా షేసి బీబీచేస్తాం దేడ్డి కట్టించి మీకీ అందులో వుంచుతాం. ముసల్మాన్‌వాలా తఢాఖా కంచెన్కు క్యామాలూం.

సుబ్బలక్ష్మి—(ప్రవేశించి చింతామణిచెవిలో నేదియో చెప్పి పోవును.)

గఫా—ఈబూబు కో౯?

చింతా—మా యింట దాసి.

గఫా—ఆరికి యీరికి తెచ్చి మీకీ తగిల్పించడానికి మీకీవుంది. అచ్ఛా అచ్ఛా. హంకు మాలుంలే.

చింతా—సాహేబుగారు! మీకు నామీఁదనున్న దయచేత నీ ముత్యాలహారమిచ్చితిరిగాని, యిది నేనుపుచ్చుకొన్నందుకు మాయమ్మ కోపించును. రొఖ మేలపుచ్చుకొనలేదని దూరును.

గఫార్—భయంలేదు మాకీ మోజువుండి ముత్తెల్ హారం యిచ్చి నాము. పైసాకు ఫర్వాలేదు ఇదిగో లేవ్ (జేబులోనుంచి పైక మిచ్చును.)

చింతా—మీవంటివారు వచ్చినప్పుడే మాకు కడుపునిండుట.

గఫార్—మాకీ యిక్కడ నిండా కష్టంగావుంది. గాలిలేదు.

చింతా—అట్లయిన మీకు గాలివచ్చుస్థలమున గూర్చుండబెట్టెదను. రండు. (నిష్క్రమింతురు.)

రంగము:—[ఆరామమందిరమున నొంటిగా బిల్వమంగళుఁడు ప్రవేశము]

బిల్వ—(తనలో) నిజముగా మధుసూదనుఁడు చెప్పినంత సౌందర్యమా చింతామణియం దున్నదా? సౌందర్యమున కేమి? అంతటి విద్యావంతురాలై యుండునా? స్త్రీలయం దిట్టి సకలశాస్త్ర

పారంగతురా లున్నదని యెక్కడను వినియుండలేదు. అయ్యది వేశ్యయైననేమి? విద్యాగౌరవమునుబట్టి యొకసారి చూచి సంతోషింపవలసినదే. ఇంతమాత్రముచేతఁ బవిత్రమైన నాసద్గుణముల కేమికళంకమువచ్చును? (ఎదుటఁజూచి) అదుగో! మిత్రుఁడగు మధుసూదనుఁడు వచ్చుచున్నాఁడు.

మధుసూదనుఁడు—(ప్రవేశించి) మిత్రమా! యొంటిగ నుంటివేమి?

బిల్వ—పనియంతయుఁ బూర్తిఁజేసితిని. సంధ్యాసమయ మగుచుండుటంజేసి, యింక గృహమున కరుగఁదలంచుచుంటిని. ఇంతలో నీవు వచ్చితివి.

మధు—అన్నా! నీకు శ్రమయిచ్చితిని కాఁబోలు.

బిల్వ—ఏమియు శ్రమలేదు. కూర్చుండుము.

మధు—కూర్చుండుటకు వ్యవధిలేదు. ఇప్పుడొక చిత్రముజరిగినది.

బిల్వ—ఆచిత్రమేమి?

మధు—ఏమున్నది. నీయందున్న వాత్సల్యముచే నీవాక్యముల ననుసరించి, చింతామణిని నిక్కడకు రాకుండఁజేయవలయునని శతవిధములఁ బ్రయత్నించితిని. కాని నాప్రయత్నము విఫలమైనది. విఫలమైనదని నేను విచారించుటలేదు. ఎప్పుడో రాదలచుకొనిన యాచింతామణి నీ సందర్శనమాచరించి తీరవలెనని యిప్పుడేవచ్చి, వీధిలో నిలఁబడియున్నది.

బిల్వ—అన్నా! ఎవరైనజూచినఁ బలువిధముల ననుమానమందెదరు కదా!

మధు—ఇప్పుడేమిచేసెదవు?

బిల్వ—విద్యావతియగు నాచింతామణి యెంతయో గుతూహలముతో వచ్చినప్పుడు నేను నిరాకరించినచో నేమి గౌరవముగ నుండును? కానిమ్ము. లోపలికిఁ దీసికొనిరమ్ము. త్వరగా మాటలాడి యెవరును జూడకుండఁ బంపివేయుదము.

మధు—(నిష్క్రమించి వెంటనే చింతామణితోఁ బ్రవేశించును.)

బిల్వ—(చింతామణినిఁజూచి) ఇది నిశ్చయముగా జింతామణియే!

ఏమి! ఈచక్కదనము వింత గొలుపుచున్నది.

మ. హరిణీ జూపుల రంభ నూరువుల హే ♦ మాభిఖ్యనుర్ దేహవై
ఖరి, దారణ సునఖప్రశస్తి శశిరే ♦ ఖన్; జెక్కులన్ జిత్రరే
ఖ; రహిన్ భ్రూలతికన్ హసించి దనరం ♦ గా! దేవతాకాంతలే
సరిరారన్నను మానవాంగనల స ♦ త్సౌందర్యమింకేటికిన్.

చింతా.—(బిల్వమంగళునిం జూచి) ఆహా! ఏమి! ఈదివ్యమంగళ స్వరూపము.

సీ. సంపూర్ణ పూర్ణిమా ♦ చంద్రబింబమని వ
ర్ణింపదగును వీని ♦ నెమ్మొగంబు
పరిఫుల్లవారిజ ♦ ప్రసవంబులంచు భా
వింపగా నొప్పును ♦ వీనికనులు
ఘనగజతుండంబు ♦ లనుచు శ్లాఘింపగా
దగువీని దృఢభుజా ♦ తల్లజములు
శ్రీకుమారుని భర్మ ♦ సింహాసనంబని
వినుతింప దగువీని ♦ వెడదయురము

తే. గీ. నలుమొగంబుల వేలుపు ♦ తొలుత నశ్వి
నీకుమార జయంతులన్ ♦ సృష్టిఁ జేసి
మదినిఁ దృప్తినొందక నిజ ♦ మహిమ మెరయ
బిల్వమంగళుసృష్టించి ♦ వెలయనోపు.

(బిల్వమంగళునిఁజూచి) పండితాగ్రేసర చక్రవర్తీ! బిల్వమంగళ నామధేయా! నమస్కారములు. అటఁగూర్చుండుడు.

బిల్వ.—(మధుసూదనునిఁజూచి) మిత్రమా! మధుసూదనా! నిలఁబడి యుంటి వేమి!

చింతా.—(బిల్వమంగళునిఁజూచి) మహాత్మా! మీరు నాసాహసమునకు మన్నింపవలయును.

బిల్వ.—చింతామణీ! ఇందు నీవొనర్చిన యపరాధ మేమున్నది? నీవు వారకామినీమణివై నను విద్యావతివని యెంతయు సంతసించితిని. ఇది వఱకెన్నఁడును నిన్ను నేఁ గనియుండలేదు. ఇప్పుడు చూచి

తిని. ముదంబొదవె. లోకముననున్న కాంతలు నిన్నాదర్శకముగఁ జేసికొని విద్యావతులై వెలయుదురుగాక!

మధు—(చింతామణినిఁ జూచి) చింతామణీ! నీవు నాహితుఁడగు నీ బిల్వమంగళునియొద్ద నభ్యసింపఁ దలంచిన విద్యయేది?

చింతా—ఆవిషయమున వీరికిప్పుడు శ్రమ గలిగింపఁ దలంపలేదు. నెమ్మదిగా తరువాత మనవిఁజేసికొందును. (బిల్వమంగళుని జూచి) మహాత్మా! నా కెన్నిదినంబులనుండియో భవదీ పాదారవింద సందర్శనమాచరింప గుతూహలమున్నది. అయ్యది నాపురాకృత సుకృతంబునంజేసి నేటికి లభించినది.

బిల్వ—నీకు నాయందున్న గౌరవముచే నట్లువచించెదవుగాని, లోకము నందున్న పండితు లందఱికన్న నే నగ్రగణ్యుఁడనా?

మధు—చింతామణికి మాత్రము నీవట్లే యుంటివి

బిల్వ—చింతామణీ! నీవిద్యావిషయమునుగూర్చి యొక్కింత ప్రశం సింపఁగోరిక యున్నదిగాని; యిప్పుడు కాలము చాలదని చెప్ప టకుఁ జింతయయ్యె. సాధారణముగ జీకటి పడక పూర్వము నే నింటికి బోవనైతినేని మాతండ్రిగారే స్వయముగా నన్న న్వేషించుచు వత్తురు.

(తెరలో)

బాబూ! బాబు!

బిల్వ—(మధుసూదనునిఁజూచి) మధుసూదనా! ఆపిలుచుచున్నది మాతండ్రిగారి సేవకుఁడగు కేశవునివలె నున్నాఁడు. వానిని ద్వారమువద్దనేయుంచి యెందులకు వచ్చెనో కనుఁగొని రమ్ము.

మధు—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) మిత్రమా! నీతండ్రిగారు నిన్ను సత్వరముగ దోడ్కొని రమ్మని యాజ్ఞ యిచ్చి నారఁట.

బిల్వ—మిత్రమా! ఇంక నేను తడయరాదు (చింతామణిని జూచి) చింతామణీ! నీ వేదియో విద్యావిషయమైనకార్యము బూని

వచ్చితివి. సావకాశముగ మాటలాడఁ జాలనందుకు విచారించు చున్నాను.

చింతా—ఆర్యా! ఇప్పుడు మించిన దేమియునులేదు. ఇంతవఱకు మీకు శ్రమయిచ్చినందుకు క్షమింపుఁడు. మరల మీసందర్శనలాభము నాకుఁ గలుగఁజేయుఁడు.

బిల్వ—మిత్రమా! నీవు నెమ్మదిగా నీచింతామణిని వోడ్కొని పొమ్ము.

చింతా—దేవా! నేను సెలవు దీసికొందును.

(తెరవాలును.)

ఇది చతుర్థాంకము.

---






## పంచమాంకము.

రంగము:—[బిల్వమంగళుఁ డొంటిగాఁ బ్రవేశము.]

బిల్వ—(తనలో) ఆహా! ఆచింతామణి సౌందర్యము వర్ణనాతీతము. తొలుత మధుసూదనుఁ డాయింతింగూర్చి చెప్పినపుడు నేనేమో యని తలంచితిని.

కం. విన్నందుకుఁ గన్నందుకు
బన్నుగఁదగియున్న దాయ ♦ బల భళిగా యా
చెన్నగునాకృతిఁ బొగడఁగ
బన్నగనాయకునికైన ♦ వశమే తలఁపన్.

ఆచింతామణీప్రతిబింబము నాకన్నులకుఁ గట్టినట్లే యున్నది. ఆనాఁడు మాతండ్రి నన్ను సత్వరముగ రమ్మని కేశవునిఁ బుత్తెంచుటంజేసి యక్కాంతతో విశేషముగ బ్రశంసించుటకు సావకాశము గుదురలేదు. నిజముగా నట్టిసౌందర్యవతి భూమండలంబున లేదని తలంపవచ్చును.

సీ. జలజాక్షి వేణితో ♦ సరిరాక గాంబోలు
జీమూతసంఘంబు జేరెఁగట్ల
పడతినెమ్మోముతోఁ బ్రతిగాకగాఁబోలు
నాసుధానిధి బహు ♦ శాఖ్రిస్రుక్కె
మొలకనవ్వులతోడఁ ♦ దులగాక గాఁబోలు
పర్వతరాజముల్ ♦ వాసెగతుల
నిందువదనకౌను ♦ కెనగాక గాఁబోలు
సింహముల్ భీతిని ♦ జేరెగుహల

తే. గీ. బోలతి యూరుల కోడి కా ♦ బోలుకదళి
కాతరువులు తలలువంచె ♦ గరితచరణ
ములకు నీడుగాలేక కాఁ ♦ బోలుఁ గమల
తతులు పంకోదయూవాప్తిఁ ♦ దనరియుండె.

ఆకాంతామణి సౌందర్య విద్యుచ్ఛక్తి సంపూర్తిగ నన్నా కర్షించి వేసినది. చింతామణిస్వరూపమును నింకొక్క సారి కనుల కఱవుదీరఁ దిలకింపవలయును. (ఇంచుక యూరకుండి) ఇయ్యది నాకెట్లు ప్రాప్తించును? విద్యావిషయంబునుగూర్చి ప్రశంసింపవలయునుగాన నొకసారి రమ్మని నేనే వార్తఁ బంపితినేని, యది యంతగౌరవముగ నుండదు. నేనే తద్గృహమునకు స్వయముగఁ బోవుదునేని, యదియొక విధముగఁ బరిణమించును.

తే. గీ. ఏను శిష్టచరిత్రుఁడ, న ♦ య్యింతి వేశ్య
యెట్లు బోవగానగు దాని ♦ యింటికిప్పుడు
పరులు దీనినిఁ జూచినఁ ♦ బరివిధముల
నిందములయందు ననుమాన ♦ మొందకుంద్రె.

ఇందుల కుపాయమేమి? ఎంత యూహించినను నాకేమియు నుపాయము వొడఁగట్టుటలేదు. (చింతామణి నుద్దేశించి) చింతామణీ!

తే. గీ. ఇట్టె వచ్చితివట్టె పో ♦ తింతి; నాదు
హృదయమందు వికారంబు ♦ నొదవఁజేసి.
యైంద్రజాలికునిం బోలి యలరునీదు
రాక కేమంచుఁ దలఁతును ♦ రమణిమిన్న.

(మధుసూదనుఁడు ప్రవేశించును.)

బిల్వ—(తనలో) నాయభిప్రాయ మీతని కొక్కింతయుఁ దెలియ నీయరాదు. (ప్రకాశముగా) మధుసూదనా! వచ్చితివా రమ్ము. ఇటుఁ గూర్చుండుము.

మధు—(ఆసీనుఁడై) మిత్రమా! మొన్న చింతామణి యిక్కడ కరుదెంచిన రహస్య మెవ్వరికినిఁ దెలియలేదుకదా!

బిల్వ—అట్లేలజరుగును? పాపము! వెఱ్ఱిగౌరవము. నాయం దేదియో యాధిక్యము కలదని వచ్చినది. ఇంతకునుఁ దనకోరిక చెప్పనే లేదు. అయినను సవిస్తరముగ సంభాషించుటకుఁ గూడఁ జీకటిపడిపోయినది. అదియుంగాక తండ్రిగారుకూడ సత్వరముగ నన్ను రమ్మని వార్తఁబంపినారు. సావకాశముగ నేను సంభాషింపలేదని యక్కాంత నావిషయమున మఱియొక విధమున దలంపలేదుకదా!

మధు—అట్లేల తలంచును అది మంచిరసజ్ఞురాలు.

బిల్వ—అవును. నేను గ్రహించితిని.

మధు—దాని సౌందర్యవిషయములో నేను చెప్పినయంశముల యం దేమైన నసత్యమున్నదా?

బిల్వ—ఆచింతామణి నిశ్చయముగ చింతామణియనియే చెప్ప వచ్చును.

ఉ. కన్నులఁ గట్టినట్టులనె ♦ కన్పడుచుండెను వన్నెమీర, నా
యన్నులమిన్నరూప మహ ♦ హా! యికనేమని తెల్పువాడ; నా
పన్నగనాథుఁడైన నవ ♦ పద్మదళాయతనేత్ర వైభవం
బెన్నగ జాలడంచు వచి ♦ యింతును నిశ్చయమిద్దిమిత్రుఁడా.

మధు—నీవర్ణనకుఁ బాత్రురాలైన యాచింతామణి యింక ధన్య

యనియే చెప్పవచ్చును. కాని, చింతామణి మొన్న గృహమునుఁ జేరగనే, తనకోరిక నీతో దెలుపనందుకు దానితల్లి యాగ్రహించినది సుమా!

బిల్వ——సావకాశముగాఁ దెలుపుదునని చెప్పినది. దాని విద్యావిషయమునుగూర్చి ముచ్చటించుటకుఁ గాలము లేకపోయినది.

మధు——తనయనుమానములఁ గొన్ని నీవలన దీర్చుకొనుటకుఁ గోరుచున్నది. మరల నీదర్శనమునకు నేటిరోజున వచ్చుటకుఁ బ్రయాణముగాగ వారించితిని.

బిల్వ——విద్యయందు దాసక్తియున్న దానియభీష్టము నేను దీర్చియే తీరవలయును. కాని, చింతామణియే యిక్కడకువచ్చుట యసంభవము.

మధు——అట్టిదాని గృహమునకు విద్యావినోదమునకు మనమరిగినను దోషములేదు.

బిల్వ——నిశ్చయమే.

మధు——మిత్రమా! నన్నుగూర్చి నీవు మఱియొకవిధమున నభిప్రాయము బూనువాడవు గావని చెప్పచున్నాను. నీదర్శనమున కొకసారి వచ్చిన యాచింతామణియింటికి రెండవసారి మన మరిగినచో గౌరవముగ నుండునని నాయభిప్రాయము. ఇందు గౌరవమున కేమైన భంగముండునని తలంతువా?

బిల్వ——విద్యావిశారదయగు నాచింతామణిగృహమునకు మన మరిగినందువలన దోష మేమియును లేదు. కాని, వేశ్యాగృహమగుటచే నాడెంద మొక్కింత వెనుదీయుచున్నది.

తే. గీ. ఎంత సద్బుద్ధితో మన ♦ మింతిగృహము
జొచ్చినను గాని, దానిని ♦ సుజనసమితి
జూచి లేని దోషంబుగా ♦ జూచి నింద
వేయకుందురె నా కవి ♦ వేకియనుచు.

దానియింటికి బోవుటయని తలంచినంతనే నాశరీరము కంప మెత్తినది.

మధు—మిత్రమా! నీ వావిషయమున సందియంబందఁ బని లేదు. నిన్ను రెండవకంటివాఁడు జూడకుండ నేను చింతామణిగృహమునకుఁ దోడ్కొని పోవుదును.

బిల్వ—ఈవిషయమున నామనంబున నించుక భీతికలుగుచున్నది.

మధు—బిల్వమంగళా! నీవు భయమందవలదు. ఒకసారి చింతామణి నీకడకు వచ్చియుంటచే నిప్పుడు నీవరిగితి వేని యెంతయో గౌరవముగ నుండును. ఈరోజున (అర్థోక్తి)

బిల్వ—అతిరహస్యముగ మనము పోయి రావలయును.

మధు—నీయపకీర్తి యొకటియు, నాయపకీర్తి యొకటియునా? భయపడకుము. (తెర వ్రాలును)

రంగము:—[చింతామణి-గృహములోగది-ప్రవేశము-చింతామణి]

చింతా—(తనలో) అహా! మహానుభావుండగు బిల్వమంగళుని దివ్య మంగళవిగ్రహము నాహృదయము నాకర్షించివేసినది.

శా. ఆదాక్షిణ్యము, నావిలాసగరిమం ♦ బస్తోక మావిద్య మ
ర్యాదాచార మపార, మా విభవ మా ♦ ర్యస్తుత్య మారూపు స
మ్మోదం బా ఘనదేహసౌష్ఠవము సం ♦ పూర్ణంబు; వేయేల; యా
ప్రాదుర్భావము మంగళాస్పదము చె ♦ ప్పఁ శక్యమే వానికిఁ.

సీ. ఆసుందరాకారు ♦ నతిమోదమునఁగూడు
చెలువసౌఖ్యంబును ♦ జెప్పవశమె?
ఆపురుషోత్తము ♦ నారాధనము సేయు
కలికిభాగ్యంబును ♦ బలుకవశమె?
ఆరవితేజు గా ♦ ఢాలింగనముగాంచు
మగువవైభవమును ♦ బొగడనగునె?
ఆమహాత్మునితోడ ♦ ననిశంబునుండెడి
తరుణివైభవము నిం ♦ తనగఁ దరమె?

తే. గీ. పౌర వీనికీడగునట్టి ♦ యందగాఁడు
మూఁడులోకములందు నే ♦ వాఁడఁజూడ

గానిపించునె; నిరతంబు ♦ వాని దగిలి
యుండు సతిజన్మమే జన్మ ♦ ముర్వియందు.

సీ. వాని మోమున మోము ♦ బరపంగగల్గిన
నిరత భోగములంది ♦ వరలినట్లు
వాని సంతత కృపా ♦ వైభవంబొదవిన
నమిత రాజ్యశ్రీని ♦ నందినట్లు
వానిచెక్కిలి ముద్దుఁ ♦ బూనంగ నేర్చిన
ఖండచంద్రస్ఫూర్తి ♦ గాంచినట్లు
వాని కెమ్మోవిని ♦ నానగాగల్గిన
కండచక్కెర రుచి ♦ గాంచినట్లు

తే. గీ. భళిర వానితో సరసంపు ♦ పల్కులాడ
గల్గినను నభీష్టములెల్లఁ ♦ గాంచినట్లు
వేయునేటికి నతఁడు ల ♦ భించెనేని
క్షితి దరిద్రునిఁ బెన్నిధి ♦ చెందినట్లు.

ఆ విద్యావిశారదుఁడు నాకు లభించునా? ధర్మపరుఁడును, నతి నిష్ఠాపరుఁడును, సుగుణమూర్తియు, బరాంగనాసోదరుఁడును నగు నాతని మదీయసదనంబున కరుదెంచి మదీయాభీష్టము దీర్చుటకు సమ్మతించునే? (ఆలోచించి) మధుసూదనుం డెట్లయిన నాతని నియ్యెడకు వచ్చునట్లు చేసెనేని, యాతనిని నా క్రేగంటిచూపులచేత, మృదువాక్యములచేత, చేష్టలచేత వశము జేసికొనలేకపోవుదునా? ఆతనికి నాపై మోహముగలుగునట్లు చేసికొనలేకపోయితినేని నా చతురత్వ మేమున్నది?

ఆ. వె. కామరహితుఁడయిన ♦ గైవల్యరతుఁడైన
నిర్మలాత్ముఁడైన ♦ నిపుణుఁడైన
వితతచతురుఁడైన ♦ వేదాంతవిదుఁడైనఁ
దన్వి చూపులకును ♦ దాళఁగలఁడె.

మహానిష్ఠాగరిష్ఠాత్ములయిన మునులకంటె నీతఁడెక్కువవాఁడా!

సుబ్బలక్ష్మి—(ప్రవేశించి) అక్కయ్యోవ్! సుబ్బిసెట్టి యిమ్మా మాసోకు చేసుకొచ్చాడు. పెద్దమ్మతో మాట్లాడుతుండా
శ్రీహ—(ప్రవేశించి) అమ్మాయీ! సుబ్బిసెట్టి వచ్చినాడు. అ జేబు బరువుగానే యున్నట్లున్నది
చింతా—ఆసంగతి నీవెట్లు కనిపెట్టితివి?
శ్రీహ—వైశ్యవిటునియొక్క యుత్సాహము మనమిట్లే కని వచ్చును.

సీ. కనకాంగుళీయముల్ ♦ గణికకు గన్పడఁ
జేయిత్రిప్పుచును భా ♦ షించుచుండు
మేనిపై ఖండువా ♦ మీదజరీని వీ
క్షించు నట్టులు సవ ♦ రించుచుండు
ముంజేతి తోడాలు ♦ మురుగులు గనిపింప
గాఁ "గమీజు" ను పైకి ♦ లాగుచుండు
చొక్కాయి జేబులో ♦ రొక్కమున్నదటంచు
జెప్పఁగాఁజప్పుడు ♦ సేయుచుండు
తే. గీ. మేటి సరసుం డటంచును ♦ మెలతకెఱుఁగఁ
జేయ వెఱ్ఱిసంభాషణ ♦ సేయుచుండు
వైశ్యవిటుడన్న వెలదిరో ♦ వట్టిపిచ్చి
వాఁడు; మాటలాడియె వానిఁ ♦ బంపవచ్చు.

సుబ్బిసెట్టితో నాలుగుకబురులు చెప్పి త్వరగా బంపివేయుము.
(నిష్క్ర)

(సుబ్బిసెట్టి ప్రవేశించును.)

సుబ్బి—(తనలో)

కం. మురుగులు తోడాల్గొల్సులు
సరితే నుంగరము సూచి ♦ సక్కసివాడే
దొరికెను తక్కువ యేవని
సిరినవ్వున మీఁదబడదె ♦ సింతామణియుఁ.

(చింతామణినిఁ జూచి) ఇదుగో! సింతామణి తీరుబడిగా కూసుండది.

సుబ్బ—బావయ్యగా రొత్తారనే!

సుబ్బి—నిజవ్వుగా అమ్మతోడే?

సుబ్బ—నువు సచ్చినట్టే, అబద్దమాడుతానా!

సుబ్బి—అందుకనే కావోసు ముస్తాబయింది.

చింతా—ఈముస్తాబంతా యెవరి కోసమనుకొన్నావు? నిలచుంటివేమి? ఆ కుర్చీమీదఁ గూర్చుండుము.

సుబ్బ—బావయ్యకి కుర్చీఅలవాటుంటేనా! దుకాణవులో గల్లాపెట్టె సోని పీటమీదేగా కూకోడం.

సుబ్బి—మంచిమాటన్నావే. (కుర్చీమీదఁగూర్చుని) అమ్మయ్యా.

చింతా—బురదలో దిగఁబడిన దున్నవలెనే కుర్చీలోఁగూర్చుంటిరిగదా.

సుబ్బి—అబ్బో! సరసాలు! ఏవి సుకఁమైన మాటేశావు. ఏది రవ్వొంత ముద్దియ్యి. (లేవబోయి) నేను ముద్దెట్టుకోడానికి కస్టపడ్డవైంది.

చింతా—నీసరసం మండినట్లేవుంది.

సుబ్బ—బావయ్యగారికి వోతంవలన దేహంపెటికెగింది. కసింత సిత్రిక పట్టించ లేకపోయినారురూ.

(నిష్క్రమించును.)

సుబ్బి—సింతామణీ! దూరంగా కూసుంటావే దగ్గిరగారా! కుర్చీకసింత జరుపుకొండూ. ఇద్దరవు దగ్గిరసా వుంటేనేగాని సరసంసాగదు.

చింతా—పుదుచ్చేరీనానునకుఁ దెచ్చెదనన్న కాసులేవి?

సుబ్బి—అబద్దవాడుతా ననుకున్నావా యేంటి. ఇయిగో! తీసుకో ఆరుకాసులు. (యిచ్చును.)

చింతా—ఇంతేకదా! ఈపాటిదానికేనా యింతముస్తాబై దాష్టీకపంతులువేషము వేసికొనివచ్చినావు. ఈకోకెక్కడిది? ఈవాళే పెట్టెలోనుంచి తీసినట్లున్నావు.

సుబ్బి—ఇదా, నాచోబనానికి కుట్టించుకొండా. ఆమూడురోజులు తొడిగి పెట్టెలో పెట్టేశాను. యిహ్యాల నీకోసం తీసినాను.

చింతా—అప్పనుగాని యెనిమిదికాసులు తెచ్చెదనని చెప్పితివే. తక్కి రెండును నెక్కడ? జేబులో దాచితివా యేమి? చూచెదను. (జే బులో చెయిబెట్టబోవును.)

సుబ్బి—కోటు సిరుగుతుంది. దాయలేదే. ఈపాలి తెచ్చిస్తాలే. కో డకు. కోమటోని సెయ్యి లాబాల సెయ్యి. ఒక్కపాల్తో వూరుక ణేదికాదు. నచ్చిందామాట? ఏవనుకొన్నావో?

చింతా—చూచెదనుగా. ఈసారి నీవు తీసికొనిరాకపోయినచో?

సుబ్బి—రెండు సెంపకాయలెయ్యి.

చింతా—అప్పుడుకాదు. ఇప్పుడే వేసెదను. (చెంపపై చెయివేయును.

సుబ్బి—వహావ్వా! వహావ్వా! వొళ్ళల్లా కదలవారింది.

(శ్రీహరి ప్రవేశించును.)

శ్రీహరి—అమ్మాయీ! విద్యావిషయమునుగూర్చి ముచ్చటించుట పండితులు వచ్చినారు.

చింతా—ఇదిగో! వచ్చుచున్నాను (నిష్క్రమించును.)

సుబ్బి—అత్తమ్మా! మంచిసమయంలో సరసం సెడగొట్టావు.

శ్రీహరి—సెట్టిగారు! పాపము ఎవరో పండితులు వచ్చినారు. ఇప్పు మరలవచ్చును. మీరాగదిలో గూర్చుండవచ్చును. రండు.

సుబ్బి—(నిష్క్రమించును.)

(బిల్వమంగళుఁడు – మధుసూదనుఁడు – ప్రవేశింతురు.)

శ్రీహరి—(బిల్వమంగళునిఁ జూచి) బాబూ! దయచేయుఁడు.

మ. మనమా వెన్న, నిదానమా ఘనము, ధా ♦ మంబా స్థిరంబో, యశో
ధనమా పూర్ణము, సద్గుణావళియు, వి ♦ ద్యాబుద్ధియా మెండటం
చును లోకంబున నెల్లవారు మిము సం ♦ స్తోత్రింబుగావింపఁగా
విని మిమ్మెప్పుడుజూతునో యనుచు ను ♦ వ్విళ్ళూరు చుంటింగదా!

నేటికి మాభాగ్యవశమున దర్శనమొసంగితిరి. మీపదధూళి సోకుటంజేసి మాభవనము పవిత్రమైనది. ఈయాసనముపైఁ గూర్చుం డుఁడు.

బిల్వ—(మధుసూదనునిఁ జూచి) మిత్రమా! నీవును గూర్చుండుము.

(ఇరువురును నాసీను లగుదురు.)

శ్రీహ—(ఆ ప్రక్కఁ జూచి) అమ్మాయీ! సిగ్గుపడుచు నచ్చట నేయుండెదవేల! అనుదినంబును నీ వేమహాత్ముని దివ్యమూర్తిని హృదయపీఠమున నిలిపి స్మరించుచుంటివో, యాపండితచక్రవర్తియె యరుదెంచెను. సిగ్గుపడక వచ్చి దర్శనముఁ జేసికొనుము.

(చింతామణి ప్రవేశించును)

చింతా—(బిల్వమంగళునిఁ జూచి) ఆర్యా! నమస్కారములు; భవద్దర్శనంబున నేను గృతార్థురాల నయితిని. మీరు సామాన్యులు గారు.

మ. సకలామ్నాయ పురాణ శాస్త్రముల భా ♦ షాకాంతనాథుండు, వా
సుకియుఁ దేవగురుండు జాలరని ని ♦ చ్చల్ వింటి, నిప్పట్ల తా
వక కారుణ్యము నాపయింబఱప దే ♦ వా వచ్చియున్నావు; నా
సుకృతంబుల్ ఫలియించెనేటికి; గుణ ♦ స్తోముఁ నిన్నుఁ జూచుటన్.

బిల్వ—(చింతామణినిఁ జూచి తనలో)

మ. భళిరా! కన్నులతీరు; మోవిరుచి చె ♦ ప్పన్ రాదు; మేల్ గుబ్బలన్
దరమా యెంచ; నొయారమా మిగులవిం ♦ తన్ గొల్పు; లేనవ్వుని
గ్గులుసయ్యారె; సదామనోహర మృదూ ♦ క్తుల్ వహ్వారే! యిట్టిని
స్తుల సౌందర్యవతీ శిరోమణిని నె ♦ చ్చోఁ జూడ భూమండలిన్.

(ప్రకాశముగా) చింతామణీ! నీవిద్యాసౌందర్యమే నన్ను రావించినది.

చింతా—పంతులుగారికి నాయెడల సంపూర్ణవాత్సల్యముండుటంజేసి యరుదెంచిరి.

మధు—నామిత్రుండగు బిల్వమంగళుఁడు సాధారణముగ నొకరిగృహమునకు వచ్చువాఁడుగాఁడు. ఈతఁ డరుదెంచుట నిజముగా నీ భాగ్యవిశేషమే యని చెప్పవచ్చును.

చింతా—(బిల్వమంగళునిఁ జూచి) దేవా! మీవంటి పండితులను జూచి నప్పుడేదో యొకటి యడుగబుద్ధి యగుచుండును.

శ్రీహ—(చింతామణినిఁజూచి) వెఱ్ఱిదానా! నీ వావిద్యావిశారదుని ప్రశ్నయడుగునంతటి దానవా?

చింతా—సరిసరి! ఎంతమాట బలికితివి. నేను వారిని బరీక్షింతునా? శ్లోకార్థము నొక్కింత యెఱుంగుటకు.

బిల్వ—సందేహింపకుము. నీవడుగఁ దలచినశ్లోక మేదో చెప్పుము.

చింతా—శ్లో॥ "అవిదితసుఖ దుఃఖం నిర్గుణం వస్తుకించి
జ్జడమతిరిహ కశ్చిన్మోక్ష ఇత్యాచ చక్షే
మమతుమతమనంగ స్మేరతారుణ్యఘూర్ణ
న్మదకల మదిరాక్షీ నీవిమోక్షోహి మోక్షః."

దీనిభావము ననుగ్రహింపఁగోరెద.

బిల్వ—ఈశ్లోకము నాకొఱకె నేతకి యుంచితివా! (తనలో) దీని భావము తెలిసియుండియే నన్నడిగినది. ఈకాంతవిషయమై నేను తలంచినతలంపు సఫలము నందునా? కానిమ్ము. (ప్రకాశముగా) చింతామణీ! దీనిభావము నీకుఁ దెలియకున్నదా! నామాట వినఁదలంచి యడిగితివి. "మూఢులు కొందఱు నిర్గుణమై యించుకేని సుఖమీయనివస్తువును మోక్షమందురు. కాని, నామతమునుబట్టి చూడ సకలకళా విశారదయైన మదిరాక్షితో నుండుటయే మోక్షము" అనియేకదా దీని యభిప్రాయము.

చింతా—చిత్తము. దీనిని గుఱించి మీయభిప్రాయమేమి?

బిల్వ—(తనలో) ఇది కష్టమైన ప్రశ్నయే. దీనిని నే నిప్పుడు చర్చింపరాదు. (ప్రకాశముగా) ఇట్టి విషయములకప్పటికప్పుడే ప్రత్యుత్తరమురాదు. ఇది మిగుల జర్చింపవలసిన యంశము. నెమ్మదిగా దీని విషయముఁజూతము.

చింతా—చిత్తము.

శ్రీహ—అమ్మాయీ! వీరియొద్ద నీవేదియో శాస్త్రమభ్యసింప నలెనని చెప్పితివే. బాబుతో యిప్పుడు మనవిఁజేసికొనరాదా!

బిల్వ—చింతామణీ! సంశయమేల?

చింతా——అయ్యది మీరు నాకుఁ దప్పక చెప్పుదుమని వాగ్దాన మొసంగినఁగాని చెప్పను.
బిల్వ——సంగతి తెలియకుండ నే నెట్లు వాగ్దానమీయఁగలను? ఒక వేళ నయ్యది నాకురాని శాస్త్రమైనచో?
చింతా——తమకు వచ్చినదే.
బిల్వ——అట్లయిన సంశయమేల?
చింతా——కోకోక్కము తమసన్నిధిఁ జదువవలయునని చిరకాలము నుండి కోరికయున్నది.
బిల్వ——(తనలో) అన్నా! ఇప్పుడు నేనేమి సేయుదును?
చింతా——ఆర్యా! ఆలోచించు చుంటిరే. వాగ్దత్తమునకు భంగముగలుగునాయేమి?
బిల్వ——అట్లెప్పుడును చేయువాఁడనుగాను. ఉస్! ఉస్ (నిట్టూర్పుపుచ్చును)
శ్రీహ——అమ్మాయీ! పంతులుగారికిక్కడ గాలివచ్చుటలేదేమో! విసరరాదూ!
బిల్వ——పోనిండు. తోటలోనున్న విహారమందిరమునకుఁ బోవుదము. రండు.

(అందఱునిష్క్రమింతురు.)

రంగము:——[రాజవీథి——మధుసూదనుఁడు ప్రవేశము]
మధు——(తనలో) ఔరా! ఎంత మోసము జరిగినది!

సీ. నీమీదనే నాకు ♦ నిజముగా వలపున్న
దంచువచించిన ♦ యతివమిన్న
నినుబాసియుండిన ♦ నిముసమోర్వఁగజాల
ననినమ్మఁజెప్పిన ♦ వనజనేత్ర
నీ నిమిత్తమునేను ♦ నిఖిలధనాఢ్యుల
జెల్మి బాసితినన్న ♦ చిగురుబోఁడి
యర్థంబులేకున్న ♦ ననురాగమేముఖ్య
మంచును జాటిన ♦ హంసయాన

తే. గీ. అరరె! కామశాస్త్రంబును ♦ నభ్యసింప
వలయుననిచెప్పి బిల్వమం ♦ గళునిఁజేర్చి
సారమేయముఁ జేసి నేఁ ♦ సాగనంపె
మోసపోయితి మఱియింత ♦ మోసపోలి.

తే. గీ. బిల్వమంగళు వంచించి ♦ వేశ్యఁ జెప్పు
ధనముచేనీకు సుఖమిత్తు ♦ ననుచుఁబలుక
సంతసించితిగాని యీ ♦ సరణినాకు
నెత్తిపైనను శరగోప ♦ మెత్తుననుచు
దలఁపనైతిని గలనైనఁ ♦ వెలవెలంది.

కామశాస్త్రాభ్యాసమని బిల్వమంగళునిఁ జేర్చుకొని నన్ను వెడలనడుపుటకే కాఁబోలు. నాకిట్టిపని జరుగవలసినదే. ప్రాణమిత్రుఁడైన బిల్వమంగళుని వంచించి తద్ధనముచేఁ జింతామణియు నేనును సుఖింపఁదలఁచుట మహాపాపకార్యమే. కావున భగవంతుఁడు నాకుఁదగినట్లే చేసినాఁడు.

సీ. కోరినవస్తువుల్ ♦ కొఱతలేకుండఁగాఁ
దెచ్చి యభీష్టంబు ♦ దీర్చినాను
చీరెనారెలులేవు ♦ చెచ్చెరఁ దెమ్మన్న
నిల్లాలినగలమ్మి ♦ యిచ్చినాను
నిల్లుగట్టఁగ నర్థ ♦ మేదన్న నాయిల్లు
నొరులకమ్మి ధనంబు ♦ నొసఁగినాను
ముసలిదా శ్రీహరి ♦ పోరుఁబడగలేక
యున్న భూములనెల్ల ♦ యొసగినాను

తే. గీ. తిట్టినను దన్నినను నామ ♦ దిని సహించి
దాసునిగ దానియింటిలో ♦ దనరినాను
ఏనినెల్లను మఱచి యీ ♦ వేశ్యకాంత
కుక్కఁగాఁ జేసినన్ దోలె ♦ నక్కటకట.

ఇదియంతయు దానిలోపము కాదు. ఇయ్యది దాని కుల వృత్తి. ఆచింతామణి నాపైఁజూపిన యనురాగమంతయు నా

యొద్ద ధనములాగుటకే. ఈవేశ్యలకుఁ గరుణపూజ్యము. నిజమైనవలపు చుక్కకెదురుగానుండును.

చం. అనలుని సాక్షిగా గొనిన ♦ యట్టి తలోదరినిఁ ద్యజించి; స
జ్జను లొగిదూషణంబులను ♦ సల్పఁగ మిత్రుల కీసుబుట్ట నీ
ధనసతిపజ్జఁ జేరితిని ♦ దద్దయు మోహము కన్నుఁగప్ప హా
మనుటికెక సెట్టులోకద స ♦ మస్తము గోల్పడినాడ దానికై.

ఎంతటి పండితుండైనను వేశ్యావ్యామోహమునఁ బడెనేని యాజ్ఞానమంతయు నశించునుగదా!

సీ. పరకాంతలను మాతృ ♦ భావముతోడ వీ
క్షించుచునుండెడి ♦ శిష్టగుణుఁడు
తండ్రియానతి మౌళి ♦ ధరియించి నిరతంబు
వర్తించుచుండెడి ♦ భవ్యచరితుఁ
డనలుసాక్షిగగొన్న ♦ యతివను బ్రేమతో
నాదరించుచు నున్న ♦ యమలమూర్తి
యెపుడుజూచినఁ బురా ♦ ణేతిహాసంబుల
బ్రొద్దుపుచ్చుచునుండు ♦ పుణ్యమూర్తి
తే. గీ. యట్టి బిల్వమంగళమూర్తి ♦ యకట! వార
కాంతమోహంబులోబడి జ్ఞానమెల్ల
బాసి మదిలోన నొక్కింత ♦ భయములేక
సంచరించుచు నుండె వే ♦ శ్యగృహమందు.

వేశ్యాసంపర్కము గలిగించుకొనినవాఁ డెవ్వఁడును బాగుపడఁడు. నన్నెట్లుజేసెనో యీ బిల్వమంగళునిమాత్రి మట్లు చింతామణి సేయకయుండునా? (ఎదుటఁజూచి) సుబ్బిసెట్టి గాబోలు వచ్చుచున్నాఁడు. వీఁడివ్యాపారముగూడ సగమైనది.

(సుబ్బిశెట్టి ప్రవేశము.)

సుబ్బి—(మధుసూదనునిఁజూచి తనలో) యాపారిపంతులు మొగం సంతకెల్లొచ్చినట్టేవుంది. ఈణ్ణి సింతామణి సెవులట్టుకొని

యీడిశేసిందంట. కాకపోతే యితఁడివల్ల కొంప గడుత్తుందా యేవిటి. యేవయినా కోవటేపారం కోవటేపారమే.

మధు—(సుబ్బిశెట్టినిఁజూచి) సుబ్బిశెట్టియూ యేమి! ఈమధ్య నెక్కడను గనుపించుటలేదేమి?

సుబ్బి—పంతులుగారా యేవిటి? పైత్తం జాస్తిఅయి కడుపులో పసరు పెరిగితే జేదిమం దుచ్చుకొన్నాను.

మధు—అవును. అదేపనిగా సుబ్బలక్ష్మి యధరామృతపానము చేయుటవలన, పసరు పెరిగినదికాఁబోలు.

సుబ్బి—అసే! సెత్తముండ. సుబ్బలక్ష్మి! సుట్టకాల్చిన సొల్లునీళ్లు కాప్పకొంటువుంటుంది.

మధు—అదియేకదా నీప్రియురాలు. చింతామణి నెమ్మదిగా దానిని నీకుఁదగిలించి నిన్ను—చెప్పడమెందుకులే.

సుబ్బి—నాకేం గెహచారం సింతామణుండఁగా. ఈకిటుకు నీకు తెలియదులే. అవునుఁగాని అడగడంమఱచాను. చింతామణీ నీవు యిడకు లిచ్చుకొన్నారట యేంటి?

మధు—అవును. ఇప్పుడు దానికన్ను బిల్వమంగళునిమీద నున్నది.

సుబ్బి—సరేగాని మీరు యూపారులు. భారీమనస్సుగలవారు. పైకం యిప్పించారుకాదు. మాకంతాలాబంకాదు. (తనలో) అడగడవేకాని యింకా యితఁడిచ్చేదేవిటి, నేను పుచ్చుకొనేదేవిటి.

మధు—చిక్కులుతీరనిమ్ము. పైకమునకేమి. నీతోకొంతరహస్యమున్నది. అటుపోయి మాటలాడుకొందము-రా.(నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

---



# చింతామణి.



లేక

## లీలాశుక.



## షష్ఠాంకము.

---

రంగము:—ఉద్యానవనము.

ప్రవేశము:—బిల్వమంగళుఁడు—చింతామణి.

బిల్వ—

చ॥ నవ నవ పుష్పజాతులు మ♦నంబునకున్ ముదమెంతొఁ గూర్చుచు
న్నవి; కనులారఁ జూచితివె ♦ నాతిరో యింతయుఁ గందకుండ నీ
పువులనుఁగోసి తెచ్చెదను ♦ బొందుగ వేణి నలంకరించి; మ
త్ప్రవిమలమానసంబును వి ♦ రాజిలఁ జేయుము సుందరీమణీ.

(అని పువ్వుల గోసి తెచ్చి చింతామణిజడయందు బెట్టును.)

చింతా—(తనలో) ఆహా! ఈతఁ డెట్టి మోహసాగరమున మునిఁగిపోయి నాఁడు! ఎట్టివాఁ డెంతలో మాఱిపోయెను!

చ. కలనయినన్ బరాంగనను ♦ గాంచి యెఱుంగని పుణ్యమూర్తి; ని
ర్మల సుగుణాకరుండు; జన ♦ మాన్య చరిత్రుఁడు; నైన బిల్వమం
గళుఁడిటు సర్వమున్ మఱచి ♦ కామినిసౌఖ్యమె స్వర్గమంచు నన్
విడువక యుండె నీగతి, వి ♦ వేకము సర్వము గోలుపోవుచున్.

వేశ్యామోహపాశమున గట్టుబడినవారి కొడలు తెలియ కదా! జూదమునందుఁ దగుల్కొనిన వాఁడును, వేశ్యను మఱి వాఁడును సర్వమును గోలుపోయి సన్యాసి యగువఱకును బు తెలియక యుండునుగదా!

చ. జనకుని యాజ్ఞనెప్పుడును ♦ సమ్మతి మౌళిధరించి చేయుచుఁ
వనితపయిఁ సదాకరుణ ♦ భాసిలఁజేయుచు, నుండినట్టి యా
యనఘుఁడు నాకతంబున ని ♦ జాంగననుఁ మఱితండ్రినిఁ మ
బునఁ దలపెట్టకే యిటులఁ ♦ బూజ్యులునవ్వఁ జరించుచుండెఁగా

(ప్రకాశముగా) ఆర్యా! మీరు నాకొరకింత శ్రమపడనేల?

బిల్వ—నేను నీకైపడిన శ్రమయేమున్నది?

చింతా—ఈ సౌధనిర్మాణమేమి? ఈ యుద్యానవనమేమి? నా యింతద్రవ్యమేల వెచ్చించెదరు?

బిల్వ—మనము జన్మించినప్పు డీధనమును దీసికొనిరాలేదు. పో నప్పుడు వెంటరాదు. దీనికై యాలోచనయేల?

తే. గీ. బిల్వమంగళు వెలకాంత ♦ వెలది! వినుమ
యూర వేశ్యలరీతినే ♦ యున్నదన్న
గౌరవంబేమి కల దంత ♦ కన్నలక్ష్మి
తోడ సంతతంబును దులఁ ♦ దూగవలదె.

చింతా—(తనలో) గణికలమాయలోఁబడి శరీరముఁదెలియక చరించు విటులచర్య లతివిచిత్రములుగదా.

సీ. వస్త్రముల్ లేవంచు ♦ భార్య తనదుచిత్త
మందు నెంతయో ♦ గుందుచున్న
నిదియేమిచేటురా ♦ యీరీతిఁ దిరిగ
వంచునుఁదండ్రి దూ ♦ పించుచున్న
నెంతచెప్పిన వినఁ ♦ డీ కుమారుండేమి
యగునోయనుచు దల్లి ♦ వగచుచున్న
జెడ్డవని యిదేల, ♦ చేసెదవంచును
స్నేహితుల్ బోధలఁ ♦ జేయుచున్న

తే. గీ. వానిలత్న్యము సేయక ♦ భావమందు
సంతసముమీఱగా వేశ్య ♦ కాంతకెట్టి
కొఱతగల్గునో యంచును ♦ గుందుచుండు
విటులచర్యలు చిత్రమై ♦ వెలయుఁగాదె.

బిల్వ—చింతామణీ! ఆలోచించుచుంటి వేమి?

చింతా—ఈసౌధము నా కతివిచిత్రముఁ గొలుపుచున్నది.

బిల్వ—బిల్వమంగళుని చెట్టఁబట్టిన నీకిట్టి మందిరముండవలదా! సౌధ నిర్మాణము పూర్తియైన పిదపగాని దీని సౌందర్యము సంపూర్తిగాఁ గనిపించదు మనశయనగృహనిర్మాణము పూర్తియైనది. అందులో నుండవలసిన సామగ్రియంతయుఁ జేయించి సిద్ధము జేసితిని. రమ్ము చూచెదవుగాక. చేయిబట్టుకొని మందిరములోనికి దీసికొనిపోయి,

మ. అదిగో! చూడుము కేళికానిలయ మో ♦ యంబ్జాక్షి! వీక్షింపు మ
ల్లదె జాళ్వాయుపరంజి దోమతెఱ ♦ పర్యం, బయ్యదె, పట్టుపా
న్పదె; రత్నాలమెఱుంగు వీవనసుమా ♦ భావంబులోనీకు స
మ్మదముంగల్గెనె వీనిఁ జూడగను,

చింతా—......................నా ♦ పుణ్యంబు సామాన్యమే.

(తనలో) తాముంచుకొన్న వేశ్యలకు మోదముగల్గుటకు విటు లెంతకష్టపడుచుందురు!

తే. గీ. కట్టుకొన్నట్టి రండను ♦ గళమునందు
బసపుకొమ్ము మాత్రమె ధరిం ♦ పంగజేసి
యుంచుకొన్నముండకు ముదం ♦ బొదవజేయ
కలిమినెంతైన దానికిఁ ♦ గట్టుచుంద్రు.

సుబ్బలక్ష్మి—(ప్రవేశించి) బావయ్యగారు! ఏవరో రామచాత్తులంట. మీతో పనుందంట. మీతో సెప్పమంటుండాడు.

బిల్వ—నే నిక్కడలేనని చెప్పకపోయితివా?

సుబ్బ—సెప్తె యినండే.

బిల్వ—అట్లయిన నేను చాలా తొందరపనిమీాదనున్నానని చెప్పవము. పొమ్ము.

చింతా—ఆర్యా! అతఁడు మీామిత్రుఁడు. ఏమపనిమీాదవచ్చునో కనుగొనుటమంచిది.

బిల్వ—నా కెవ్వరితోడను నేమియుఁ బనిలేదు.

మ. నినునొక్కప్పుడునైన వీడక సదా ♦ నీతోడనేయుండి, నీ
మనసింపారఁగ సర్వభోగములు సా ♦ మాన్యంబుగా గాంచుచుం
డిన, నాకయ్య దెచాలు, సంతసమగున్ ♦ వేయేల: సర్వంబు నీ
వని భావించుచు నున్నవాఁడ మదిలో ♦ నజ్ఞాతపత్రేక్షణా!

చ. వదలితి నన్నియుం జపత ♦ పంబులతోఁ బనియేమిలేదు, నా
సుదతినినైనఁ జూడఁ బరి ♦ శుద్ధచరిత్రయైన; మిత్రులన్
వదలితి: తండ్రిసేవ నెడ ♦ బాసితి; బంధులు దిట్టినన్ సరే
వదలగజాల నిన్ను నవ ♦ పంకజపత్ర విశాలలోచనా.

చింతా—(తనలో) ఎంతలో బరమనైష్ఠికుఁ డిట్లు మారినాఁడు!

చ. తనసతి శోకమందునని ♦ తల్పఁడు, దుఃఖము నొందు తండ్రియుం
చనితలపోయఁ డాప్తులప ♦ హాస్యము జేయుదురంచునైన నె
మ్మనమునఁ జూడబోవక స ♦ మంచితధర్మము లెల్లవీడి; నన్న
న్నిశముగూడి యుండుచు మహా ♦ సుఖమంచుదలంచుచుండెఁగా.

ఈతఁ డీరీతిని మారిపోవుటకు నేనేకదా కారణము.

తే. గీ. సకలవిద్యా విశారదు ♦ సచ్చరిత్రు
మహితవిజ్ఞాను సద్వంశ ♦ మణిని నిట్లు
వలపుఁజూపించి వంచించి ♦ యలరునాకు
నేమిగతి సంభవించునో ♦ యెఱుగఁజాల.

(తెరలో)

నేను కోర్టుకెందుకయ్యా! వుండడల్లోయి. బతికిసెడినోణ్ణి. మరేద తీయకండి. నేనోస్తాను. యిడవండి.

చింతా—(ప్రక్కనుజూచి) సుబ్బలక్ష్మీ! వీధిలో నాగంద్రగోళమేమి?

సుబ్బ—(ప్రవేశపెట్టి) అక్కయ్యోవ్! చుబ్బిచెట్టిని కోర్టుబంట్రోతులు లాక్కెల్లుతుండారు. ఒకతేగోలెడ్తుండాఁడు.
బిల్వ—మనసుబ్బలక్ష్మికొఱకు వచ్చుచుండు సుబ్బిసెట్టియేనా?
చింతా—అవును. వీనికి మీరేదైన నుపకారము సేయవలయును.
బిల్వ—నీకట్టికోరికయున్న వానిఋణములు నేను దీర్చువేసెదనురమ్ము.
(నిష్క్రమించుచున్నారు.)

రంగము:—[బిల్వమంగళునిమందిరము:—
పరివేశము:—విచారముతో రాధ ]

రాధ—(తనలో) హా! పరమేశ్వరా!

మ. పతియేదైవమటంచు సంతతము సం ♦ భావించు నాకిప్పుడీ
గతిఁ గారుణ్యము బూనకుండమదిలోఁ ♦ గల్పింతువే సిల్గులక్ష్
క్ష్మీ తినేఁజేసిన పాపమేమి యకటా ♦ జీవేశుసత్సేవ సం
తతముక్ జేయనికాంత జీవితము వ్య ♦ ర్థంబౌగదా యెంచగక్.

అక్కటా! నాస్థితికి నేమనివగతును!

సీ. పరకాంత నెన్నఁడు ♦ బరికించి యెఱుగని
పూజ్యుండు వేశ్యకై ♦ పోవుచుండె
తండ్రి దైవంబుగాఁ ♦ దలచుచుండెడివాఁడు
తండ్రినే యెప్పుడు ♦ దలపకుండె
నామీఁదనెప్పుడు ప్రేమజూపెడివాఁడు
నేనన్నకోపియై ♦ నెగడుచుండె
ననిశంబుహితునితో ♦ నలరుచుండెడివాఁడు
స్నేహితునే దరిఁ ♦ జేర్పకుండె

తే. గీ. సకల శాస్త్రరహస్య వి ♦ చారమెపుడు
సేయువాఁడు దానినిఁజెవిఁ ♦ జేర్పకుండె
శ్రీరమాధీశు చింతనక్. ♦ జెలఁగువాఁడు
భక్తికినిదూరమై నేడు ♦ బరగుచుండె.

అయ్యో! నాప్రాణేశ్వరుఁడు నాయం దెంత నిర్దయుఁడై యుండెను!

సీ. భోజనార్థముగృహ ♦ మునకువచ్చుటెగాని
భ్రాంతియంతయు వేశ్య ♦ పైననుండు
అతిభక్తి నెదురుగా ♦ నరిగినంత నెచూచి
నను జూడకయె తప్పు ♦ కొనుచునుండు
దరిఁజేరి భాషింపఁ ♦ దలచినఁ దొందర
పనియున్న భంగినిఁ ♦ దసరుచుండు
నిలువుఁడీ యొక్కింత ♦ పలుకాడవలెనన్న
సమయంబుగాదని ♦ చనుచునుండు
తే. గీ. ఎవరు నాయార్తిదీర్చెద ♦ రేమిసేతు
నెవరితో మొరవెట్టుదు ♦ ధవునకిట్లు
నిష్కరుణగల్గె నామీద ♦ నేనుపూర్వ
భవమునందునఁ జేసిన ♦ పాపమేమొ.

అక్కటా! నామనోహరుఁడు నాయెడల నెంతనిర్దయుఁడై యుండెను!

సీ. ఒకసారి క్రేగంట ♦ నొప్పుగాజూచుటే
పదివేలటంచునుఁ ♦ బల్కియుంటి
సంప్రీతితోఁ జేయు ♦ సంభాషణమెనాకు
దృష్టియానంచును ♦ దెలుపుకొంటి
సావకాశముగ భో ♦ జనముఁ జేసి యరుగు
మంచును వేడ్కఁ బ్రా ♦ ర్థించియుంటి
నిమిషంబు గృహములో ♦ నిలిచి చరణసేవ
నైన నిమ్మంచును ♦ నడిగియుంటి
తే. గీ ఎంతవేడినఁగాని కా ♦ సంతయైన
గరుణఁజూపక యుండెనా ♦ కాంతుఁడకట
యెంతభాగ్యముగల్గిన ♦ నేమిఫలము
కానఁగాచిన వెన్నెల ♦ కరణిగాదె.

నానాథునిచిత్త మీరీతిగా మారునని నేనెన్నఁడును గలనైనఁ దలంపనైతిని. పరమపావనచరితుఁడైన యాతఁ డీరీతిని వర్తించు

చుండుట నాదురదృష్టముకదా! పతిపదాంబుజసేవఁజేసి కృతార్థురాలుకానిసతి బ్రతుకేల? నాస్థితి యీరీతినున్నది. ఇంక మామగారిచింతకు మేరయేలేదు.

తే. గీ. పరమపావన చరిత్రుఁడై ♦ వరలుకొడుకు
వెలవెలంది మఱగెనను ♦ బెంగచేత
మంచముంబట్టి మిగుల దుః ♦ ఖించుచుండె
దిక్కునాకేది దైవమే ♦ దిక్కుగాక.

నిరంతరమును మామగారు కుమారునికై పడుచున్న దుఃఖమును జూడఁజాలక యున్నాను. (ఇంచుక యూరకుండి) అక్కటా! మిట్టమధ్యాహ్నమైనను, నింతవరకును భోజనమునకు రాలేదు. (ప్రక్కం జూచి) అదిగో! అడుగులచప్పుడు వినవచ్చుచున్నది. (పరికించి) ప్రాణేశ్వరుండే వచ్చుచున్నాఁడు.

(బిల్వమంగళుఁడు ప్రవేశించును.)

రాధ—(ఎదురుగాబోయి) ఆర్యపుత్రా! నమస్కరించుచున్నాను. భానుఁడు తన ప్రచండకిరణపంక్తులను పాంథాళిపైఁ బ్రసరింపఁజేయుచు మలమల మాడ్చివేయుచున్నాఁడు. మిగుల ప్రొద్దుపోయినది. నిండువేసవి. ఇంతవఱకును భుజింపక యుంటిరి. మీరెప్పుడరుదెంతురోయని వేచియుంటిని. త్వరగా స్నానముఁజేసి మడిగట్టుకొనుఁడు. ఉష్ణోదకము దొడ్డిలోనున్నది.

బిల్వ—నాకొఱకు నిన్ను వేచియుండవలసినదని చెప్పియుంటినా?

రాధ—భర్త భుజింపకపూర్వము భార్య భుజించుట ధర్మమా?

బిల్వ—కడుపునింపుకొను విషయములోగూడ ధర్మాధర్మములు జూడవలయునా?

రాధ—నాథా! త్వరగా స్నానముసేయుఁడు.

బిల్వ—స్నానముసేయుటకు నాకు వ్యవధిలేదు. ఈపూటకు గాళ్ళు గడుగుకొని భుజించెదను. (ఇంచుక యూరకుండి) నీవు భోజనముపెట్టుట కాలస్యమగును. కావున నేనే పెట్టుకొని తిందును.

(లోపలికి బోవును.)

రాధ—(తనలో) అయ్యో! నే నేమిసేయుదును? ఈతఁడు భ్రాంతి యంతయు వేశ్యయింటిమీఁదనే పెట్టుకొని వచ్చెనుగదా! (ఎదుటఁ జూచి) అదిగో! భోజనముగూడ నైనది.

(బిల్వమంగళుఁడు ప్రవేశించి తొందరగా బోవఁదలచును.)

రాధ—మనోహరా! ఇంతలోనె భోజనముచేసి వెళ్ళుచుంటిరా?

బిల్వ—ఇప్పటికే యాలస్యమైనది. నేను తొందరగా బోవలయును.

రాధ—ఎక్కడికి?

బిల్వ—అట్లడుగరాదని నీకుఁ దెలియదా? అట్లడుగుట దుశ్శకునము. నే నిప్పుడు చింతామణియింటికిఁ బోవలయును. నన్ను వారింప వలదు.

రాధ—నాథా! మీయిచ్చవచ్చిన ట్లరుగవచ్చును. కాని యీదీన రాలు పలుకువాక్యము లొకనిమిష మాలించి యరుగుఁడు.

బిల్వ—ఇప్పు డేమంతతొందరపని మిగిలిపోవుచున్నది? మఱియొకప్పుడు మాటలాడరాదా!

రాధ—ఏమైననుసరే. నాయందు గృపవహించి మీరొక్కింతకాల మిటనుండుఁడు. సమ్మతింపరేని మీపాదముల కడ్డువడియైన నాపెదను.

బిల్వ—బాగున్నది. నీయేడుపేదో కానిమ్ము.

(కూర్చుండును.)

రాధ—ప్రాణేశ్వరా!

సీ. గణికయింటికిఁ బోవఁ ♦ గారాదనుచు మీకు
బలుమారు నేనెప్డు ♦ పలుకలేదు
అవిలేదునాకు ని ♦ య్యదిలేదు తెమ్మంచు
నోరెత్తిమిమ్మెప్డు ♦ గోరలేదు
చింతామణికి మీరు ♦ చేకూర్చు పరమ సౌ
భాగ్యంబునకు నేను ♦ వగవలేదు
వేశ్యచేఁజిక్కి దు ♦ ర్వృత్తి నుంటిరటంచు
జెలఁగి మిమ్మెప్డు దూ ♦ షింపలేదు

తే. గీ. భవ్యభవదీయ చరణసే ♦ వయె యొసంగ
వేడుచుంటిని; నామాట ♦ వినుచుఁ గరుణ
బూని నాయభీష్టము దీర్చి ♦ పోవకుంట
ధర్మమేమీకుఁ జెప్పుఁడీ ♦ ధర్మచరిత.

మహాభాగా! నేను మీరు సేయుకార్యముల కెన్నఁడును నాటంకము గలిగించియుండలేదు. చింతామణిని విడనాడుమని చెప్పలేదు. గృహంబున కరుదెంచినప్పుడొకఘడియకాలమయిన నుండి, ప్రీతితో నాతో భాషించి భక్తితో నేఁ జేయుసపర్యల గైకొనుమని వేడితిని. ఇదియే నాప్రార్థన.

చ. పడతికి సర్వభాగ్యములు ♦ భర్తనుబట్టియె కల్గుగాదె, యె
ప్పుడు పతిసేవదూరమయి ♦ పొల్చునొ నాతికి, దానిజన్మ మీ
పుడమిని వ్యర్థమౌనుగద ♦ పూజ్యుఁడ వన్ని యెరింగియుండి యీ
వడువున నన్దలంప వది ♦ భావ్యమె శ్రేయమె సంప్రదాయమే?

నాకేమియు భాగ్యము లవసరములేదు. మీ పదాంబుజ సేవమాత్రము నాకు దయసేయుఁడు. ప్రాణకాంతుని పాదసేవయే సాధ్వికి సకలసౌభాగ్యములకును నాలవాలము. అదియే యశంబునకుఁ బట్టుకొమ్మ. అదియే మోక్షసౌధారోహణమునకు సోపానము. వేయేల? పతిభక్తిలేని సతిబ్రతుకు వ్యర్థము. (విచారించును.)

బిల్వ—ఇంతీ! నీవేల విచారించెదవు? నేను నీకుఁ జేసినకొఱంత యేమున్నది?

రాధ—మహానుభావా! మీపదసేవ నాకొసంగకపోవుటకన్న వేఱే కొఱతయున్నది? పోనిండు. నేను సాధ్వినికానని తలంచితిరా? విద్యలేనిదాననా? రూపహీననా? ఏకారణముచేత నాయెడల మీరింత నిష్కరుణ వహించితిరి?

బిల్వ—

మ. వనితా! నీవు మహాపతివ్రతవు లో ♦ పంబెద్ది నీయందుగం
టినటంచున్ వచియింపనేర్తు వినుమీ ♦ డెందంబు చింతామణీ

వనితామోహనిబద్ధమయ్యె, నికనన్ ♦ వారింప లేరెవ్వరున్
మనమందున్ ననుగూర్చినీవు వగవం ♦ భావ్యంబుగా దింకిటన్.

రాధా! నీవు విచారించినందువలనఁ బ్రయోజనము లేదు. నే నాచింతామణీమోహపాశమునఁ గట్టువడితిని. అదియే మోక్ష మని భావించి యితరవ్యసనంబుల విడిచివేసితిని.

రాధ—(ఏడ్చుచు) హా! నాథా! వారాంగనకొఱకై కులకాంత నిట్లు నిరాదరంబునఁ జూచుట న్యాయముగాదు. మీ కృపాంబువులు నాపై వర్షింపకపోయినచో నే నొక్కనిమిషకాలమయినను జీవింపఁ జాలను. భవదీయ దివ్యచరణకమలస్మరణ సేయుచుఁ బ్రాణంబులు విడిచెదను. పిదప మీరు పశ్చాత్తాప మందెదరు.

బిల్వ—నీవు విచారింపవలదు. ఇప్పుడు నీపలుకులు నాచెవింబడవు.

ఉ. శ్రీరమణీకళత్రపద ♦ చింతనమాధురికన్న; మేటిద్రా
క్షారసతీరుకన్న; ఘన ♦ శర్కరకన్నఁ బవిత్రమైన భా
గీరథి నీరుకన్నఁగడుఁ ♦ గీర్తిదమై, మధురంబునౌచు నొ
ప్పారు ధనాంగనాయధర ♦ పానము నన్నుఁ గృతార్థుఁజేయుతన్.

మ. జలకేళిన్ సవరింపఁ జేలమును ని ♦ చ్చన్విప్పఁగాఁజూచి, చ
ప్పుడుగాకుండను వెన్కకేగగను నన్ ♦ బొల్పార వీక్షించి, యె
వ్వఁడురా వచ్చెనటంచునుం బలికి యా ♦ పై నన్ను వీక్షించి నా
వలనంగల్గిన తప్పుసైపుమనుచున్ ♦ బ్రార్థించు చింతామణీ
జలజాతేక్షణ వాక్యజాలము ననున్ ♦ సంప్రీతితో నేలుతన్.

(కొంతదూరము నడువగా-రామశాస్త్రి ప్రవేశించును.)

రామ—(ప్రవేశించి) ఓహో! మిత్రుఁడగు బిల్వమంగళుఁడా! చింతామణీమోహపాశమునఁ జిక్కి స్నేహితుఁడనైన నన్నుఁ గూడఁ జూడకయుంటివికదా! దిక్కుమాలినముండ నీకెక్కడ దాపరించినది. ఏమయినను రెండునిముషములు నాతో మాటలాడెదవా?

బిల్వ—రామశాస్త్రీ! నేను సత్వరముగ నరుదెంతునని చింతామణితోఁ జెప్పియున్నాను. అది నాకొఱకై వేచియుండును.

రామ—ఇదియేకదా తొందరపని.

చ. గురుపితృభక్తియుఁ శమముఁ ♦ గూర్మియు, జ్ఞానము సర్వశాస్త్రవి
స్ఫురణవివేకముఁ వినయ ♦ ముఁ మొదలైనసమస్త సద్గుణో
త్కరము బరిత్యజించి ధన ♦ కామిని కెట్లు వశుండవైతివో
యరయఁగ నీచరిత్రమిపు ♦ డద్భుతమై కనుపట్టె మిత్రమా!
అనేక కొంపలార్పిన యామిండకుఁ జిక్కి యెట్లయితివి?

బిల్వ—రామశాస్త్రీ! నీవు దానిని దూషింపకుము. వలయునెడ నన్ను దూషింపుము.

రామ—నిన్నేల దూషింపవలెను? ఆ మాయముండయగు చింతామణి వలలో నెట్లుదగులుకొంటివో యూహింపఁజాలకున్నాను. నీ వేదాంతశాస్త్రవివేకమంతయు నేమైనది? నీపితృభక్తి యిప్పు డేమూలదాగినది? భార్యపైనున్న నీప్రేమ యెందడఁగినది?

చ. అనలునిసాక్షిగాఁ గొనిన ♦ యట్టితలోదరి యాత్మగుంద; నీ
జనకుఁడు నిన్నుగూర్చి కడు ♦ స్వాంతమునఁ దపియింప నెల్లస
జ్జనులు హసింపఁగా సకల ♦ శాస్త్రములఁ బఠియించినట్టి యా
ఘనతచెడంగ నిట్లు ధన ♦ కామినిఁగూడి చరింతువే కటా.

బిల్వ—మిత్రమా! చింతామణి లోకములో వేశ్యలవంటిది కాదని నేనుఘంటాపథముగఁ జెప్పగలను. సర్వశాస్త్రార్థ సంచయ రహస్యసారమంతయు జింతామణి యధరామృతమునందే యున్నది. సకలసత్కర్మలఫలంబు చింతామణీ ముఖమండల దర్శనమునందే యిమిడియున్నది. వేయేల! సంపూర్ణశశిపాకర బింబ ప్రతిమానమగు చింతామణీవదనాంభోరుహవీక్షణమే నాకు సర్వమునని భావించియుంటిని.

రామ—సఖుఁడా! ఆగ్రహింపకుము. మానము విక్రయించుకొని జీవయాత్రఁగడుపు చింతామణిని శ్లాఘించుటకే కాఁబోలు నీవింత

పాండిత్యమార్జించితివి. చింతామణి తక్కిన వెలకాంతలవంటిది కాదని పలికితివి. వేశ్యజాతియందు ద్వివిధములు లేవు. నీవు వెఱ్ఱివాడవై పలుకుచుంటివి.

సీ. మాయలెన్నో పన్ని ♦ మాన్యచరిత్రుల
మోహాబ్ధిలోపల ♦ ముంచుచుంద్రు
కపటానురాగంబు ♦ విపరీతముగఁజూపి
విత్తంబుగైకొని ♦ వెలయుచుంద్రు
వలపుమందుల దంప ♦ తుల కెడబాపి వి
టుల కుక్కలుగ జేసి ♦ పిలుచుచుంద్రు
పలుబాసలను జేసి ♦ వలపును గలిగించి
దాసులుగాఁజేసి ♦ తనరుచుంద్రు
తే. గీ. వేయునేటికి భూమిలో ♦ వేశ్యకెఱుక
లేనితంత్ర మొక్కటియును ♦ లేదు; దాని
వలచి, వర్తించుచుండెడి ♦ వాని బ్రదుకు
పరమనీచంబుగాఁ గంద్రు ♦ భవ్యమతులు.

నీ విన్నిగ్రంథములఁ జదివితివి. నీవెందైన వేశ్యలతోఁగూడి యుండుట యోగ్యమైనదని చదివితివా?

బిల్వ—గ్రంథావలోకన మేల? స్వానుభవమే.

రామ—చింతామణివలననేనా?

బిల్వ—అవును. నీవు చెప్పినసంగతులన్నియు దక్కినవేశ్యలవిషయమై వర్తించునేమోగాని చింతామణికి మాత్రముగావు. చింతామణి నిశ్చయముగా సమస్తసద్గుణమణియనియే నాయభిప్రాయము. ఆశరదిందుబింబప్రతిమానవదన, ఆవినీలకుంతల, ఆసరోరుహపత్రవిశాలలోచన, ఆహేమాంగి, ఆసింహేంద్రమధ్య, ఆమదగజయాన, నిజముగా వేశ్యలలోఁ బుట్టవలసినదికాదు.

రామ—అవునవును. చింతామణిని వర్ణించుటకు నీకుక్షిలోఁ బదములు చాలకున్నవని తలంచెదను. "తాను వలచినది రంభ, తానుమునిగి

గినదిగంగ" యనువాక్యము సార్థకము జేసితివి. ఆమాయవేష ములే యింతమందికొంపలు మ్రింగివేయుచున్నవి.

సీ. గబ్బువాసన యింత ♦ కన్పట్టకుండంగ
సబ్బుతో దేహంబు ♦ చమిరి చమిరి
మెతక కంపింత్రైన ♦ మీదికిరాకుండ
దలపై సువాసనఁ ♦ బులిమి పులిమి
చుట్టకాల్చినకంపు ♦ చూపట్టకుండంగ
పెక్కుసార్లాకులు ♦ కుక్కి కుక్కి
కనుబొమల్ నల్లగా ♦ గనిపింపఁ గాటుక
బల్ పసందుగ నెంతొ ♦ ప్రామిప్రామి

తే. గీ. వీథిగుమ్మంబు కడఁజేరి ♦ విటులువచ్చు
వేళఁజూచుచు నీమాయ ♦ వేషమునను
వారి లోఁగొనుచుందురు ♦ వారసతులు
వారిజేరెడివారల ♦ బ్రతుకురోత.

బిల్వ—హితుఁడా! చింతామణి సహజసౌందర్యవతి. నామీదనున్న దాని వల పపారము.

తే. గీ. బిల్వమంగళ స్మరణయే ♦ వెలది కెపుడు
రామనామ సన్మంత్రపా ♦ రాయణంబు
భవ్యచింతామణీనామ ♦ భజననాకు
మోక్ష సామ్రాజ్యలక్ష్మినిఁ ♦ బొందఁ దెరువు.

రామ—బిల్వమంగళా! ఎంతవెఱ్ఱివాఁడవు. వేశ్యకెక్కడనైనను నిజమైన వలపుండునా? ధనమిచ్చు ప్రతి విటునియందును వలపుఁ జూపుచునే యుండును. కాకిజాతియందు తెలుపును, వేశ్యకు నిజమైన వలపును జూడలేము. ఇంక నీతర్కము గట్టిపెట్టి నా మాటవినుము. వేశ్యామోహసాగరంబునఁబడి మునిగిపోయిన వారల నెందఱినో చూచినాను. ఇంక నీ వాచింతామణి పేరు స్మరింపక,

తే. గీ. నిన్నె దైవంబుగా నెంచు ♦ నీరజాక్షి
రాధపైనఁ జూపింపుమా ♦ రమ్యకరుణ
నిన్నుఁగూర్చిన బెంగచే ♦ నెగడుచున్న
తండ్రిపైఁ బ్రేమఁజేర్పుము ♦ ధన్యచరిత.

బిల్వ—ఇదియేనా నీవుచెప్పుసంగతి. చాలుచాలు. చింతామణి నాకై నిరీక్షించుచుండును.

(నిష్క్రమించును.)

రామ—ఆహా!

తే. గీ. వలదు వలదంచు గొంతెత్తి ♦ పలుకుచున్న
వినక చని గోతిలోఁబడు ♦ మనుజుకరణి
నెంతచెప్పిన నామాట ♦ నింతయేని
వినక చనుచుండె నీతఁడు ♦ వెఱ్ఱియగుచు.

ఓవేశ్యావ్యామోహయంత్రమా! నీయొద్ద నెట్టి యాకర్షణశక్తి యున్నది! అంటువ్యాధివలెఁ బ్రాకుచున్న యీచీడ యెప్పటికి నశించునో! ఎప్పుడు భారతవర్ష ముద్ధరింపబడునో!

(నిష్క్రమించును.)

ఇది షష్ఠాంకము.

# చింతామణి.

లేక

## లీలాశుక.

## సప్తమాంకము.

[రంగము:—గదిలో మంచముపై వాసుదేవమూర్తి
—ప్రక్క రాధ — ప్రవేశము]

రామ—(తనలో) ఆహా! పుత్రవాత్సల్యము వర్ణనాతీతముకదా!

తే. గీ. పుత్రుఁ డవివేకియైననుఁ ♦ బూజ్యుఁడైన
పరమ గుణవంతుఁడైన ని ♦ ర్భాగ్యుఁడైనఁ
దండ్రి ప్రేమను బల్కంగఁ ♦ దరముగాదు
కడుపువంటితీపినిఁ గానఁ ♦ గలమెజగతి.

ఈ మహానుభావుఁ డింతకుమున్నె యనేకసారులు 'అబ్బాయి వచ్చెనా, వచ్చెనా' యని యడిగి కన్నుమూసినాడు. ఏమి యుపద్రవము తటస్థించునో తెలియకున్నది. చింతామణి గృహముననున్న నా నాథున కనేకవార్తలఁ బంపితిని. ఇంతవఱకును రాలేదు. ఇప్పు డెటు బోయి యెటువచ్చినను నాకు రెండవదిక్కు లేదు. జగమంతయు నంధకారబంధురమై యున్నది. ఆఁగో! అంధకారమునకుండ్రోడు ద

ముగ మబ్బు గ్రమ్మినది. భగవంతుఁడా! దీనశరణ్యుఁడవగు నా కీసమయమున దిక్కు-.

వాసు—ఊ! ఊ! ఓహో? ఏమి విమానము. నాయనలారా! రందఱు విష్ణుకింకరులా! నాకొఱకే వచ్చినారా! ఆహా! నాభాగ్యము!

రాధ—(భయము నటించుచు) అయ్యో! ఈయనమాటలు నా మిగుల భయమును గలుగఁజేయుచున్నవి. ఈరాత్రి గడ నట్లులేదు. (వాసుదేవమూర్తినిఁ జూచి) మామగారు మామగారూ! ఏమిటి పలుకుచున్నారు? యొత్తిగిలిప డుఁడు.

వాసు—ఆ. ఆ. ఏమీలేదు. అబ్బాయి వచ్చినాఁడా!

రాధ—కబురు పంపినాను. ఇప్పుడే రాగలరు. మీకెట్లున్నది?

వాసు—అమ్మాయీ! రాధా! గుండెనొప్పి కొద్దిగా తగ్గినట్లున్నది నీవు భయపడకుము. (ఇంచుక యూరకుండి) అబ్బా! ఏ యొకవిధమయినమమత నాకన్నులఁ గప్పుచున్నది. నాయనా బిల్వమంగళా!

రాధ—(తనలో) అక్కటా! ఈయన కుమారునివిషయమము నెంతగా బలవరించుచున్నాఁడు! చింతామణి గృహమున మరల నెవ్వరినైనఁ బంపుటకు మనుష్యులయిన లేరు.

వాసు—అమ్మాయీ! ఈరోజున గృష్ణాష్టమికదా! ఆహా! ఏ మంచిరోజమ్మా. అబ్బాయి వచ్చినాఁడా?

రాధ—(ఎదుటఁజూచి) అదుగో! వచ్చుచున్నారు.

[బిల్వమంగళుఁడు - ప్రవేశము.]

రాధ—(బిల్వమంగళునిఁ జూచి) ప్రాణేశ్వరా! మామగారా స్థితిలో నున్నారు. మీవిషయమై యనేకపర్యాయము లడిగినారు

వాసు—నాయనా! బిల్వమంగళా! (ఇంచుక తలయెత్తి) వచ్చితివా ఇటురమ్ము.

బిల్వ—(తండ్రిని సమీపించును.)

వాసు—కుమారా! నాకు వచ్చే ప్రాణము, పోయే ప్రాణము! ఇట్టిస్థితిలో భార్యను నొంటిగా విడిచి వేశ్యాగృహమున నున్నచో నిక్కడ నెవ్వరుదిక్కు? ఇంత వివేకశూన్యుఁడ వైతివేమి? అహర్నిశలాచింతామణియింటనే యుండవలయునా? చచ్చుటకు సిద్ధముగానున్న నాయొద్ద రెండునిమిషము లుండకూడదా? ఇంకను నీకు బుద్ధి యెప్పటికి వచ్చునది? ఆపాడుముండ నిన్నెట్లు కట్టివేసినదిరా?

బిల్వ—ఇట్లు దూషించుటకేనా నేను రాలేదని కలువరించితిరి? మీరేమయినను సరే చింతామణిని దూషించవలదు.

వాసు—వేశ్యయన్న నీకెంత యభిమానమురా! అయ్యో! దానిని మఱిగి సుగుణశీలయగు యీరాధనుఁ జూడకుంటివిగదా. తండ్రిని నేను బ్రదికియుంటిని గనుక చెప్పుచుంటిని. నాయనంతరము నీకుఁ జెప్పువారెవ్వరును లేరు. నీ నిమిత్తము కంటికి మంటికి నేకధారగాఁ నేడ్చుచున్న రాధనైనఁ జూడవేమిరా! ఈమెయందు నీవేమిదోషము గనిపెట్టితివి. ఎప్పుడును నీసేవ తప్ప యన్యమెఱుగని సాధ్వి. అట్టిఈపవిత్రచరిత్రను దుఃఖపెట్టుటధర్మమా? "కలకంఠకంఠి కన్నీరొలికిన" అని చిన్ననాఁడు చదివినపద్యము మఱచిపోయితివా?

బిల్వ—తండ్రీ! ఈసమయమున నావిషయమై మీ రనవసరమైన యాందోళనము మనస్సులో బెట్టుకొనకుఁడు. నేను చిన్నవాఁడనుగాను. నామంచిచెడ్డలు నాకు దెలియును.

వాసు—తెలిసియే యిట్లు చేయుచుంటివా? ఏమో చదువుకొంటివనియు, వంశమునకుఁ గీర్తిదెచ్చి నన్నుగృతార్థునిఁ జేయు కుమారుఁడవనియు దలంచితినిగాని, యిట్లావిషపూరితమధుఘుటికయగు చింతామణికిఁజిక్కి యీరీతి నగుదువని నే నెన్నఁడును దలంపలేదు. ఇప్పుడైనను బుద్ధితెచ్చుకొని సాధ్వీమణియగు రాధఁజూచుకొనుచు, నతిశాంతముగఁ గాలమును వెళ్ళదీయుము.

బిల్వ—ఎప్పుడుచెప్పిన నిదియే సోదికదా! చింతామణి చింతామణి యని దూషించుచుందురు. అదేమి చేసినది? మీకు జబ్బుగా నున్నదని మీయందుండు ప్రేమచేఁ జూచివచ్చుటకు నన్ను మెడ పట్టుకొని నెట్టినది. ఇప్పు డర్ధరాత్రిసమయమైనను మరల నేనచ్చటికేగి మీదేహస్థితిసంగతి జెప్పువఱకు నిద్రింపక వేచియుండును.

రాధ—(తనలో) ఈ యర్ధరాత్రిసమయమున చావుబ్రతుకులతో నున్న తండ్రినివిడిచి మరల జింతామణియింటి కేగునుగాఁబోలు. హా! దైవమా! నాకిప్పు డేమిదారి. (ఆలోచించి) కానిమ్ము. ఈరాత్రికి పడవదాటించు పల్లెవాడు రేవున లేకుండ జేసివచ్చెద గాక. (నిష్క్రమించి వెంటనే ప్రవేశించును)

వాసు—అమ్మాయీ! రాధా!

రాధ—(సమీపించి) మామగారూ! ఏమి సెలవు?

వాసు—అమ్మా! నాకాయాసము హెచ్చుచున్నది. నాకు జీవితాశ యేమియునులేదు. కుమారునికంటె నెక్కువ వాత్సల్యముతో నన్నరసిన నీఋణమును నేను దీర్చుకొనజాలను. నీప్రాణేశ్వరుఁడు చింతామణికి దగులబెట్టిన యాస్తిగాక నావశమున నున్న యాస్తి నీకిచ్చుచున్నాను. ఇదిగో! అసంబంధమైన పత్రములు.

రాధ—(సందేహించును.)

వాసు—అమ్మా! సందేహించెదవేల? రమ్ము.

రాధ—(వాసుదేవమూర్తిని సమీపించి కాగితములు దీసికొనును.)

బిల్వ—కన్నకొడుకు నిట్లుసేయుట ధర్మముగాదు.

వాసు—ఇదియంతయు నీవశము జేసితినేని రేపుసాయంత్రమునకే యంతయు మండబెట్టెదవు. ఇప్పటికైనను నీకుగలిగిన కొఱంత యేమియులేదు. అంతయు రాధస్వాధీనమున నుండును. నీవు బుద్ధిమంతుఁడవైతివా, పదిమందికిఁబెట్టి నీ వనుభవింపవచ్చును. లేదా నీకర్మ మెట్లున్న నట్లగును.

బిల్వ—పోనిండు. అట్లేయగును.

రాధ—(బిల్వమంగళునిఁజూచి) ప్రాణేశ్వరా! ఈపత్రములు ఈయాస్తి నాకుఁగావలయునా? నాకు మీ పాదసేవతప్ప మఱియేదియు నవసరము లేదు. ఇవిగో పత్రములు. మీచిత్తమువచ్చినట్లు సేయుఁడు. (కాగితములిచ్చును.)

వాసు—అయ్యో, అయ్యో, వానికీయవలదు. కొంప ముంచివేయును. (ఇంచుక యూరకుండి) అబ్బా! ఆయాసమంతకంతకధికమగుచున్నది. గుండెలలో బరువుగానున్నది. (కన్నులు మూయుచున్నాఁడు.)

రాధ—మామగారూ! మామగారూ!

బిల్వ—తండ్రీ!

వాసు—నారాయణ. నా+రా+ణ

రాధ—నాథా! చూచెదరేల. ఈయన మనల విడిచిపెట్టి వెళ్లుచున్నారు. మంచమునుండి క్రిందికిదింపి పరుండఁబెట్టుదము. రండు! రండు! (ఇరువురునుబట్టి వాసుదేవమూర్తిని క్రిందికిదింపి పరుండఁబెట్టుదురు.)

రాధ—(పరికించి) అయ్యో! యింకేమున్నది! మామగారు మనల విడిచిపెట్టినారు.

బిల్వ—హా! తండ్రీ!

ఉ. చిన్నతనంబునుండి యర ♦ చేతిని నప్పమురీతిబెంచి! వి
ద్యాన్వితుగాఁగఁజేసి కృప ♦ భాసిల నాపయిఁజూపుచుండి, న
న్నెన్నివిధంబులో యరసి ♦ యీగతి ప్రేమనుబాసి యక్కటా!
నన్నునుఁ గోడలిన్ విడువ ♦ న్యాయమె! మమ్మెవరింక గాంతురో.

రాధ—నాథా! ఈసమయమున మీరు చింతించినందువలన బ్రయోజనములేదు. మనల నోదార్చువారెవ్వరును లేరు.

బిల్వ—అయ్యో!

తే. గీ. సంతతము నామ క్షేమమే ♦ స్వాంతమందు
దలచి, బుద్ధులఁజెప్పెడి ♦ ధర్మచరితుఁ

డట్టి నాతండ్రి ననుబాసి ♦ యమరపురికి
నరుగ; నెట్లోర్వఁగలవాఁడ ♦ దరుణిమిన్న.

రాధ—పితృశోకము దుర్భరమైనదే! కాని,

మ॥ తనువుల్ శాశ్వతమే; యశోవిదిత మాం ♦ ధాతాది భూమీశ్వరుల్
జనరే! యైహిక సౌఖ్యముల్ సతములా ♦ జాయాత్మజుల్ నిత్యులా
ఘనసౌధంబులు, భాగ్యముల్ ధనము పీ ♦ కన్ వెంట నేతెంచునే
యనఘా! సర్వమెఱింగియుండి యిటులే ♦ లా చింత స్వాంతంబునన్.

(పెద్దధ్వని వినవచ్చును)

బిల్వ—(ఉలికిపడి) ఆధ్వని యేమి?

రాధ—నాథా! అది పిడుగుపడినచప్పుడు.

బిల్వ—(ఆతురతతో) హా! ఏమీ! పిడుగే! చింతామణిమీఁద పడిన దేమో! నేను సత్వరముగఁబోయి చూచివచ్చెదగాక!

(నడుచుచున్నాఁడు.)

రాధ—(వెంటఁబడి) నాథా! ఏమిది? ఇప్పు డెక్కడికిఁబోవుదురు? అర్ధరాత్రిసమయము.

ల్వ—చింతామణి యింటికి. దాని కేమియపాయము వాటిల్లెనో యరయవలయును.

రాధ—అక్కటా! ఈయధర్మమేమి! అర్ధరాత్రిసమయంబున నీశవముయొద్ద నన్నొంటిగనుంచి యిప్పు డయ్యెడకుఁ బోవుదురా? ఏమిసాహసము! ఈశవమునకుఁ బ్రేతసంస్కారాదిక్రియలు నిర్వర్తించినపిదప మీ యిష్టమువచ్చినట్లు సేయుఁడు.

బిల్వ—అంతవఱకును నాచిత్తము నిలువదు. అయిన నీరాత్రి నేను చేయవలసినపని యేమియు లేదు.

(నిష్క్రమించును.)

రాధ—హా! ఎంతయధర్మము! హా! ప్రాణేశ్వరా! నీవెంతకఠినహృదయుఁడవైతివి? అర్ధరాత్రి సమయమునఁ దండ్రిశవంబు నిట్లు విడిచి వారాంగనగృహమున కరుగుచుంటివే! (దైవమునుద్దేశించి) హా! పరమేశ్వరా! నీలికోవిదులగు మహాపురుషులకుఁ

గూడ మాయవలపుజూపించి, మోహసాగరంబున ముంచి పెక్కుకొంపలు మాపుచు, ననేక సాధ్వీశిరోమణుల నేత్రముల నుండి నీరుగారఁజేయుచున్న యీ వేశ్యల నేలసృజించితివి? వీరి వలన బరమపవిత్రమైన భారతవర్షమునకుఁ గళంకమువచ్చుచు న్నది. వీరమహాపతివ్రతల శాపవాక్యాగ్నిజ్వాలలు మిమ్మేల దహింపకున్నవి! మీరేల వివాహములఁజేసికొని సుఖింపరు! ఓ సంఘసంస్కరణాభిలాషులారా! వేశ్యాకాంతాగృహంబుల కరుగవలదనియు, వారి మేళముల బిలువరాదనియు, నిచ్చకంబు లకు నుపన్యాసము లిచ్చినందువలనఁ బ్రయోజనములేదు. నిజమై న దీక్షవహించి, వేశ్యలను వివాహితలగాఁజేసి యశమునార్జిం పుఁడు. ఈపడుపువృత్తిని భస్మీపటలము జేయుఁడు. ప్రక్కలోని నల్లులవలె బాధింపుచు, ననేకసంసారముల గంగలోగల్పు చున్న యీ పడుపుగత్తెలను నలిపివేయుఁడు. వారాంగనా మారణమహాధ్వరకార్యమున కుపక్రమింపుడు. (ఇంచుక యూ రకుండి) ఎవరో పిల్చుచున్నట్లున్నారు. ఎవరులేరు. కృష్ణవేణియే నన్ను దనలోఁ జేరి స్వర్గమున కరుగుమని ప్రబోధించుచున్నది. నేనిప్పు డామెనే శరణుఁబొంది శాశ్వతపదవి నందెదఁగాక!

(నిష్క్రమించును.)

రంగము:—[చింతామణిసౌధము:—ప్రవేశము-చింతామణి]

చింతా—(తనలో) ఆహా! నేఁడు శ్రీకృష్ణాష్టమి యగుటంజేసి యా యములోని గోపాలవిగ్రహమును సంపూర్తిగ నలంకరించి నారు. ఆహా! విగ్రహసందర్శనము జేసినప్పుడు నాయొడలు మఱచిపోయితిని. అమ్మహాత్ముని సేవించి యెంతమంది భవ బంధములఁబాసి కృతార్థులయిరి. (శ్రీకృష్ణుని నుద్దేశించి) హా కృష్ణా!

సీ. కడుపు చల్లగ నిన్ను ♦ గన్నయా దేవకి
తొలినేమి వ్రతములు ♦ సలిపెనొక్కొ

బిడ్డగా నిన్నెత్తి ♦ పెంచినట్టియశోద
వాసిగానేపూజ ♦ జేసెనోకో
అనిశంబు నీతోడ ♦ నాటలాడినగోప
బాలురెంతటి భాగ్య ♦ వంతులోకో
భవదీయ మహిమంబు ♦ బాగుగానెఱింగిన
యక్రూరుఁడెంత పు♦ణ్యాత్ముఁడోకో

తే. గీ. విమలపు నీకరుణగాంచి ♦ వెలయుకుబ్జ
యెంతధన్యాత్మురాలోకో ♦ యిట్టివచ్చి
పిడికెడటుకుల నర్పించి ♦ విభవమెంతొ
యందిన కుచేలుఁడెంత కృ ♦ తార్థుఁడోకో.

దేవా! నందనందనా! భవదీయ నామముచ్చరించుటకైన నర్హతలేని నీచజన్మమందిన నన్ను రక్షింపుము.

(నిద్రించును.)

[శ్రీకృష్ణుఁడు ప్రవేశించును.)

శ్రీకృ—(తనలో) పగచేనైనను, ప్రేమనైనను, భక్తినైనను, నన్ను భజించువారికి శుభములఁ జేకూర్చుచుందును. నేఁడీ చింతామణి మదీయాలయంబునకు వచ్చి నన్ను దర్శించుటంజేసి మనంబున నాయందొకవిధమైనభక్తియేర్పడినది. ఇయ్యది యింతవఱకును నీచవృత్తి నవలంబించియున్నను, నేటికి నాపై భక్తిగలుగుటం జేసి కృతార్థురాలు కాగలదు. దీనివలన బిల్వమంగళుఁడుగూడ ధన్యుఁడయ్యెఁడుగాక! (అంతర్ధానుడగును.)

చింతా—(దిగ్గునలేచి) కృష్ణా! నిలువుము. నిలువుము.

ఉ. ఆర్తనునైన నన్నుఁ గృప ♦ నాదరణంబొనరింపగా జగ
త్కర్తవు వచ్చినాడవిటు ♦ గావున దీనికి సత్ఫలంబుగా
ధూర్తవిదారి! నామనము ♦ దోరముగా భవదీయచింతనా
వర్తిలజేయుమయ్య ముని ♦ వందిత! నిన్నికనాశ్రయించెదన్.

(ఇటునటు బరుగెత్తును.)

సుబ్బలక్ష్మి—(ప్రవేశించి) ఏమిటక్కయ్యా! నిద్దరలోనుంచి గభాలున లేచి పరుగులెత్తుతుండావు. మేళాని కెళ్లినప్పు డెక్కడైనా జడుసుకొన్నావా యేమిటి?

చింతా—కృష్ణా! పిలుచుచుండఁగాఁ బోవుట ధర్మముకాదు.

మ॥ మునులున్ జ్ఞానులు సాధుమార్గచరులే ♦ పుణ్యాత్మునిం జూడఁగా
ఘననిష్ఠం దప మాచరించియు వెసన్ ♦ గానంగ లేకుండు రా
సనకాద్యుత్తమ మౌనిపూజిత పదా ♦ బ్జాతున్ రమాదారునిన్
నినువీక్షించితి సంతసంబొదవ వె తం ♦ డ్రీ నన్ను రక్షింపవే.

మ. ధనమే మోక్షమటంచు నెంచుచును జి ♦ త్తంబందు శంకింపకే
జనులన్ మోసముసేయు నీచమగు వే ♦ శ్యావృత్తినింబూనినా
నని శంకింపకుమయ్య మ్రొక్కెదను నే ♦ నావృత్తి వర్జించి నీ
ఘనపాదంబులఁ గొల్తు దీనజనర ♦ క్షా! నన్ను రక్షింపవే.

(ఇటునటు జూచును)

సుబ్బ—ఏమిఁటక్కయ్యా! పిచ్చిదానికిమల్లె ఇటూ అటూ పరుగు లెత్తావు. (పట్టుకొనును.)

చింతా—ఏఁడీ! భగవంతుఁడగు వాసుదేవుఁ డెట్లరిగినాఁడు?

సుబ్బ—వాసుదేవుఁ డెవరు?

చింతా—కృష్ణుఁడు.

సుబ్బ—కుష్ణుఁడు మనింటి కెల్లావస్తాఁడు?

చింతా—వచ్చినాఁడే.

మ. తొలు కార్మబ్బున మించువోలె నొడలం ♦ దున్ జాళువాపుట్టపున్
వలెవాటొప్పఁగఁ గౌస్తుభం బురమునన్ ♦ భాసిల్ల మౌళిన్ శిఖా
వళపింఛంబలరన్ రథాంగదరముల్ ♦ బాహుద్వయిందాల్చి; ని
స్తులకారుణ్యముఁబూని నిల్వఁగను; ని ♦ చ్చోటన్ విలోకించితిన్.

సుబ్బ—నాకు సూపించావు కాదే వఁక్కయ్యా! నీతో యేవన్నా సెప్పినాఁడా?

చింతా—చెప్ప కేమి!

మ. కులకాంతామణులెల్ల దిట్టఁగను నె ♦ గ్గున్ సిగ్గులేకుండ; ని
ర్మలచిత్తంబుననుండు ధీరులఁ జలిం ♦ పక జేసి; దవ్యార్జనం
బిలగావింపుచు గాలముల్ గడపగా ♦ నీక్షింప శ్రేయంబె ని
శ్చలభక్తిన్ భజియింపుమీ నను మహా ♦ సౌఖ్యంబు జేకూరెడిన్.
అని చెప్పినాఁడు.

సుబ్బ—నువ్వు డబ్బు తెచ్చుకుంటూవుండావని ఆయనకున్నూడా కన్ను కుట్టిందికాఁబోసు.

చింతా—ఆమహాత్ముఁడు నాకు భక్తిప్రబోధము జేసినాఁడు. సుబ్బలక్ష్మి! నే నొర్చినపాపమునకు మేరయున్నదా?

సీ. పాపమూలంబైన ♦ పడుపువృత్తినిబూని
వారి వీరికి కొంగు ♦ పఱచినాను
ప్రేమఁ జూపించియో ♦ బెదరించియో నవ్వఁ
జేసియొ ధనమునా ♦ ర్జించినాను
పడతు లెందఱో తమ ♦ ప్రాణనాధులకునై
జీవముల్ వాయఁగాఁ ♦ జేసినాను
భాగ్యవంతులను ని ♦ ర్భాగ్యులుగ నొనర్చి
తిండికై తిరిపె మె ♦ త్తించినాను
తే. గీ. రాత్రియనక పవలనక ♦ దవ్యమే ని
జేశుగానెంచి నాదరిఁ ♦ జేరనట్టి
వారి నెల్లరఁగూడి పా ♦ పంబుగట్టు
కొంటి నక్కటా! నాజన్మ ♦ కూలిపోను.

సీ. విటకాండ్రచే నుండి ♦ విత్తముల్ గొనమాయ
వేషములెన్నెన్నొ ♦ వేసినాను
సిగ్గన్నమాటను ♦ చిత్తమందున జేరఁ
గానీక గజ్జను ♦ గట్టినాను
వృద్ధిలోనికి వచ్చు ♦ బుద్ధిమంతుల జేర్చి
పదిమంది కొంపల ♦ బాపినాను

పలుబాసలను జేసి ♦ వలపునుగల్గించి
మించివిటులను వ ♦ ర్మించినాను

తే. గీ. కుంటిమైన గుడ్డియయిన ♦ గుష్ఠుఁడైన
నిక్కమా విటకాఁడవు ♦ నీవెయంచు
బలికియున్నాను మిగుల పా ♦ పంబు గట్టు
కొంటి కటకటా నాజన్మ ♦ కూలిపోను.

(తలుపుచప్పుడువిని)

సుబ్బలక్ష్మి! ఎవరో పిలుచుచున్నారు. అర్ధరాత్రిసమయమున నెవ్వరువత్తురు? కనుఁగొనిరమ్మ.

సుబ్బ—(నిష్క్రమించి) అక్కయ్యా! బావయ్యగారె వచ్చింది.

(బిల్వమంగళుఁడు తడిబట్టలతో ప్రవేశించును.)

చింతా—(బిల్వమంగళునిఁజూచి) వర్షములో దడిసితిరాయేమి!

బిల్వ—వర్షములోఁగొంత, కృష్ణాప్రవాహములోఁగొంత.

చింతా—అదియేమి! అట్లుపలుకుచుంటిరి? మీనాయనగారు సుఖులై యున్నారుకదా!

బిల్వ—ఆ—దివంబున సుఖులైయున్నారు.

చింతా—హరిహరీ! ఎంతమాటవింటిని. (ఇంచుకయూరకుండి)అక్కటా! ఈసమయమున నేలయరుదెంచితిరి?

బిల్వ—నీమీాదనున్న యనురాగమే నన్నిట్లు చేసినది.

చింతా—అక్కటా! ఎంతసాహసకార్యము!

తే. గీ. జనకుఁడేగెను మిముఁవీడి ♦ స్వర్గమునకు
నింటభార్య యొంటిగనుంకె ♦ నేరుపొంగి
గట్టులకుదాకి యుండెను ♦ నంధకార
మ దు వానగురిసియుచుండె ♦ నట్టిసితిని
వత్తురే యక్కటా! వార ♦ వనితకొఱకు.

ఈయర్ధరాత్రిసమయమున మిమ్ము నదినిదాటించిన పల్లెవాఁడెవఁడు?

బిల్వ—పల్లవా! కెవ్వఁడును లేఁడు. భగవంతుఁడే దో యొక మార్గముఁ జూపును. ఏటియొడ్డున పడవ లేకుండుటఁ జూచి, నెమ్మదిగా నెట్లయిన నీదుకొని రాఁదలంచి రేవులో దిగుసరికి నాకాలికొక శవము తగిలినది. దానిం దెప్పగాఁ జేసికొని యీవలకుఁ జేరితిని. కాని నేనొకపనిమాత్రము జేసితిని. ఆశవమును మరల ప్రవాహములోఁ బడవేయక యొడ్డుననే పడవైచితిని.

చింతా—ఏమీ! మీవాక్యములు నిజమైయుండునా?

బిల్వ—సందియ మేమియు లేదు. దీపము బట్టుకొని రమ్ము. చూపించెద.

చింతా—(దీపము పుచ్చుకొని) రండు.

బిల్వ—(కొంతదూరము దీసికొనిపోయి) అదిగో! సందేహనివారణముఁ జేసికొనుము.

చింతా—(దీపపు వెలుతురునఁ జూచి) ఓహో! ఇయ్యది స్త్రీశవము. పాపము! ఎవరోకదా!

బిల్వ—చింతామణీ! దీపము కొద్దిగా ముందునకు దెచ్చి చూపుము.

చింతా—(అట్లు సేయును)

బిల్వ—(శవమును బరిశీలించి) హా! పరమేశ్వరా! (మూర్ఛనొందును)

చింతా—ఆర్యా! ఏమిది! (లేవనెత్తును.)

బిల్వ—చింతామణీ! ఇంకేమున్నది?

సీ. పతిభక్తియం దరయం ♦ ధతిమించి వెలలేని
యశమును నార్జించి ♦ యలరుదాని
తాలిమియందున ♦ ధారుణికీడంచు
బలువురువచియింపఁ ♦ బరఁగుదాని
సద్వివేకసుగుణ ♦ సంపదయందు మ
దాలస కీడౌచు ♦ దనరుదాని
పుట్టినయింటికి ♦ మెట్టినింటికిగూడ
గౌరవంబును నిల్పి ♦ క్రాలుదాని
తే. గీ. సంతతము మనోవల్లభు ♦ చరణకమల
సేవయే ముక్తియంచు వీ ♦ క్షించుదాని

నాకు నిల్లాలయినదాని ♦ నాదుచేతు
లారఁ జంపికొంటినికదా ♦ యక్కటకట.

చింతా—అక్కటా! ఈమె మీభార్యయగు రాధయా! ఎంతఘోర మెంతఘోరము! ఈ సాధ్వీలలామ కిట్టిపా టెట్లుసంభవించినది?

బిల్వ—చింతామణీ! ఏమిచెప్పుదును. ఈయర్ధరాత్రిసమయమున శవజాగరణంబున కీమె నొంటిగ విడిచివచ్చుచుండ నన్ను బోవలదని ప్రార్థించెను. నేనీమె ప్రార్థన నిరాకరించిన కారణంబు నబ్బిదుకునురోసి కృష్ణానదిలోఁ బడియుండును.

చింతా—ఆహా! ఈసాధ్వీమణీనామస్మరణ జేసినచో బంచమహాపాతకములును నశించునుగదా!

చ. పతు లిలనెందఱో కలరు ♦ స్వాంతమునం గనుభ క్తిబూనుచుఁ
బతులకు సేవలఁ సలుపు ♦ వారలు ప్రాణములుండ; గాని యీ
గతి మరణించియుఁ బతికి ♦ గన్యాతరంబగు సేవఁజేయు నీ
పతికి సమానమైనసతి ♦ క్ష్మాతలమందున నుండఁబోవునే?

సాధ్వీలలామయు, బావనచరిత్రయు నగు నీమెమృతికి మీరే కదా కారణము. దీనివలన మీ రెట్టిపాపమునుఁ బొందుదురో!

బిల్వ—తరుణీశిరోమణీ! నాకు నీమీఁదనున్న మోహము పాపపుణ్యములఁ జూడనిచ్చుటలేదు. నీకూటమియే నాకు స్వర్గపదముగ నున్నది.

చింతా—ఆర్యా!

తే. గీ. అఖిలశాస్త్రార్థ సంవేది ♦ వైననీవె
ధనమె ధవునిఁగా నిరతంబు ♦ దలచుచు డు
నాటవెలదికై యింత మో ♦ హంబునందఁ
దగునె; ధర్మమే యియ్యది ♦ తలఁచిచూడ.

బిల్వ—చింతామణీ! నేఁడు నీనోటినుండి క్రొత్తపలుకు వచ్చినది. నా విద్యావిజ్ఞానసమంతయు భవదీయ జగన్మోహన విగ్రహాభివర్ణనంబు

నకే పనికివచ్చినది. అయినను నీవు సామాన్యవేశ్యవు గావు. నీకును దక్కిన పడుపుగత్తెలకును హస్తిమశకాంతరము.

చింతా—ఇట్లే ప్రతివిటుఁడును దలంచుచుండును. ఈ వెఱ్ఱియే యనేక విటుల కొంపలుదీసినది. అంతియేకాని మీరు తలంచినట్లు తక్కినవేశ్యలకంటె నే నెక్కువదానినిగాను.

బిల్వ—అదియంతయు నాకుఁ దెలియదు. నీ సౌందర్యము నన్ను బూర్తిగ మోహసముద్రములో ముంచివేసినది.

చింతా—సౌందర్యమును జూచియా మీరు భ్రమించితిరి? బాగున్నది. నేను క్షణములో వచ్చెదను. మీరిచ్చటనేయుండుఁడు.

(నిష్క్రమించును)

బిల్వ—(పశ్చాత్తాపముతో) చింతామణి పలుకులయం దసత్యమేమియునులేదు. వేశ్యలు ధనముకొఱకే తమ వలపుజూపుదురనుమాటలో సంశయమేమున్నది? ఈచింతామణికి నాకుఁ బూర్వమెంతమంది విటులుండిరో! (ఇంచుక యూరకుండి)

తే. గీ. పండితుఁడనౌచు నొప్పిన ♦ ఫలమదేమి
జ్ఞానమెల్లను మంటలోఁ ♦ గలిపి; వేశ్య
మఱిగి కన్నతండ్రినిఁ గడు ♦ మాన్యచరిత
యౌసతిని జంపుకొంటిని ♦ అక్కటకట.

చింతామణీవ్యామోహము నన్ను ప్రపంచకమునే మఱపించి ...ది. అక్కటా! నేనెంత పాపిని! (భార్య నుద్దేశించి)

సీ. పతిమాట నిరతంబు ♦ పైడిమూటగనెంచి
భక్తిజరించిన ♦ పరమసాధ్వి
ఎంతభాగ్యంబున్న ♦ నింతయేనియు గర్వ
మనుమాట యెరుగని ♦ యమలచరిత
నేనెంత కొట్టినన్ ♦ దిట్టినగాని ప
రమశాంతమూనిన ♦ రమణిమిన్న
మందునకైన మో ♦ మందు జీకాకెపుడు
గనిపించి యెఱుగని ♦ కలుషరహిత

తే. గీ సకల విద్యలనరసి వి ♦ శారదయన
పడతులెల్లఁ జెప్పుకొనగ ♦ వరలుకాంత
యకట! నాకతంబునగాదె ♦ యంతమందె
నెంతపాపచిత్తుండనో ♦ యెంచిచూడ.

అటువంటి పరమపావనచరిత్రయగుభార్య నాకుఁ గక్కునా! నే నెట్టినిర్భాగ్యుఁడను.

సీ. పుడమియందున ఖ్యాతి ♦ నడసిన నాకుల
గౌరవము నుమంట ♦ గలిపినాను
పెంచి పెద్దఁ జేసి ♦ వెలసినతండ్రినా
కయి బెంగచేఁ జావఁ ♦ గాంచినాను
నేనదైవంబుగా ♦ నెంచినభార్యను
ముప్పతిప్పలుబెట్టి ♦ ముంచినాను
అన్నివిద్యల నేర్చి ♦ యార్జించినట్టి వి
ఖ్యాతిని గంగలో ♦ గల్పినాను



తే. గీ. గణికయేనాకు దివ్యమో ♦ కుంబటంచు
నెంచి, సిగ్గుబూనక చరి ♦ యించినాను
బ్రతికియుండిన నింకేమి ♦ ఫలముగలుగు
నన్నివిధముల భ్రష్టుండ ♦ నైతిగాదె.

చింతా—(అలంకారరహితయై ప్రవేశించి) ఆర్యా! నే నిప్పుడెట్లు న్నాను? సౌందర్యవతి నగుదునా? కాదా?

బిల్వ—చింతామణీ! చింతామణీ! ఇదియేమివేషము! నీవు చింతామణి వేనా?

చింతా—నేనుచింతామణినే.ఇప్పుడునేనుసౌందర్యవతి నందురా కాదా?

బిల్వ—నా కాశ్చర్యముగనున్నది.

చింతా—ఇం దాశ్చర్య మేమియును లేదు.

సీ. చంద్రాస్యవంచును ♦ సన్నుతింతురుగాని.
కడునీచవాసన ♦ గాంచలేరు

చూపులంగని మరు ♦ తూపులందురుగాని
ప్రాణముల్ బాపు శ ♦ రంబు లనరు
కుచములు బంగారు ♦ కుండలందురుగాని
బొత్తిగా జర్మపు ♦ దిత్తులనరు
పసిడిబొమ్మయటంచు ♦ భావించెదరుగాని
జలబుద్బుదంబంచు ♦ దలపబోరు
తే. గీ. కటకటా! యిట్టితుచ్ఛ సౌ ♦ ఖ్యంబుకొఱకు
కలితమోహాబ్ధిబడి కనుల్ ♦ గానలేక
ధనము మానంబుగోల్పోయి ♦ జనములెల్ల
బరిహసింప నొప్పెదువాని ♦ బ్రతుకురోత.

బిల్వ—(లేచి) హా! చింతామణీ! కాదుకాదు. నన్ను గృతార్థునిఁ జేయఁదలంచిన జ్ఞానస్వరూపిణివి. తల్లీ! నమస్కారము లందుకొనుము.

చింతా—(తప్పించుకొని) మీ సేవకురాలనగు నాయెడల నిట్టి యను చితకార్యము సేయుచుంటి రేల?

బిల్వ—నీవు సేవకురాలవుకావు.

తే. గీ. తల్లి! నీ ప్రబోధంబుచే ♦ నుల్లమందు
సంతసంబెంతయోగల్గె ♦ సత్యముగను
నామదోషముల్ గ్రహియించి ♦ నాను మేలు
గాంచితిని నిద్రలేచి నీ ♦ కరుణవలన.

ఓచిత్స్వరూపిణీ! నీ విట్టి మహాజ్ఞానవంతురాలవై యుండియు నన్నేల యి ట్లంధకారమునం దిన్నిదినములనుండియు నుంచితివి?

చింతా—నేనును మీవలెనే యంధకారమునందే యుంటినిగాని, యింతకుమున్నే నిద్రించుచుండ భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు సాక్షాత్కరించి నాకుఁ బ్రబోధము చేసినాఁడు.

బిల్వ—ఆహా! నీ వెంతధన్యాత్మురాలవు? నేనెంతయు [illegible]

సోమగిరియోగి—(ప్రవేశించి) నీవు నిర్భాగ్యుఁడవుకావు. చింతింప కుము. భగవత్సంకల్పముననే నేను నీకడ కరుదెంచితినని తలంపుము. దేవాలయమునకు ప్రక్కనున్న మఠములో నున్నాను. పాపమొనర్చియుఁ బశ్చాత్తాపము నందుచుండిన కారణమున నీవు కృతార్థుఁడవగుదువు. ఇంక నీవు లీలాశు కుండ వన బఱఁగెదవు. రమ్ము. వాసుదేవమంత్ర ముపదే శించెద.

బిల్వ—మహాత్మా! ధన్యుఁడనైతిని. (ఆకసమువంక జూచి.)

తే. గీ. దేవ నిన్నెంతయైన ను ♦ తింపవచ్చు
నెఱిగియుండియు నిటు విష ♦ యేచ్ఛనున్న
నాకుఁ వేశ్యా ప్రబోధమున్ ♦ గల్గఁజేసి
గురుని జూపించినాడవు ♦ కరుణబూని.

(సోమగిరితో నిష్క్రి)

రంగము:—[రాజవీధి-మధుసూదనుఁడు ప్రవేశము.]

మధు—(తనలో) ఆహా! తుద కెట్టిస్థితిలోనికి మారితిని? అఖండైశ్వ ర్యముతోఁదులదూగిన నే నిప్పు డుదరపోషణార్థమై వంటవాఁడ నైతినిగదా!

మ. కపటస్నేహము జేసి నమ్మికలు వ ♦ ర్ణాణించి ద్రవ్యార్థమై
యుపలాలింపుచు ద్రవ్యమెల్ల గరమం ♦ దున్నంతయున్ లాగి, బి
క్కపకీరున్ వలె సేయజాలెడి లస ♦ త్కాంతామణుల్, వేశ్యలన్
జపలస్వాంతల నమ్మరాదు జనముల్ ♦ సత్యంబు ముమ్మాటికిన్.

(తెరలో)స్వదేశీ చేగోడీ-స్వదేశీ చేగోడీ-తాజా-అల్వా)

మధు—(తనలో) ఆహా! సుబ్బిసెట్టికిగూడ యెట్టిగతి సంభవించినది! వేశ్యలను నమ్మినవాఁ డెవఁడు బాగుపడినాఁడు?

(సుబ్బిసెట్టి-ప్రవేశము.)

సుబ్బి—పంతులుగారా యేవిటి, దండాలు, దండాలు.

మధు—ఈపల్లె మేమిటి?

సుబ్బి—సిన్నప్డు మాఅయ్య చేసిన యాపారం. మళ్ళీయిప్డు సింతామణి మూలాన్న సేతికొచ్చింది. పంతులుగారుకూడా సాలా నష్టపడ్డట్లున్నారు.

మధు—ఇప్పు డేమివిచారించిన నేమిప్రయోజనమున్నది? చింతామణి యోగినియైనదఁట. వింటివే?

సుబ్బి—యిన్నాను. అందరికి నున్నంగా గొఱిగి దొంగసన్యాసం పుచ్చుకొందా యేవిటి?

(తెరలో)

ఇదిగో! మీరిక్కడేవుండారేమి! మాఅక్కయ్య యెవరెవరి కగ్గిఱ సొమ్ములుతీస్కుందో అందరికీ యిచ్చేస్తాంది, రండి.

మధు—సుబ్బిశెట్టి! విన్నావా! చింతామణికి మంచిబుద్ధిపుట్టినది. పోయి తెచ్చుకొందము రమ్ము.

సుబ్బి—ఇఁకనే, మళ్లీ వొక యెలుగు యెలిగిత్తాం.

(నిష్క్రమించి వెంటనే ప్రవేశింతురు.)

మధు—చూచినావా! చింతామణిచెప్పినమాటనిజము వేశ్యాసంపర్కమువలన గలిగెడునష్టములను బహిరంగముగా సమస్తజనులకు దెలుపుమని చెప్పియున్నది. ఇప్పుడు మనమట్లు సేయవలయును.

సీ. భార్యలేడ్చుచునుండఁ ♦ బడుపుకత్తెలపొందు
నాశించునట్టి పా ♦ పాత్ములార
సానితో సౌఖ్యమే ♦ స్వర్గమంచును గల
భాగ్యమర్పించు ని ♦ ర్భాగ్యులార
కల్లప్రేమనుఁజూప ♦ కడుపుబ్బి నెత్తిపై
నెక్కించుకొనుచుండు ♦ హీనులార
పీకుదానునుబోలు ♦ వెలదినోట విడెంబు
చవిజూచు చుండెడి ♦ చవటలార

తే. గీ. ఇప్పుడైన తెలివిఁబూని ♦ యెన్నడికను
వేశ్యకడకేగమని యొట్టు ♦ బెట్టుకొనుఁడు
దానిసంపర్క మెప్పుడు ♦ దలపవలదు
స్వానుభవమిది చెప్పుచు ♦ న్నాను వినుఁడి.

సీ. రొక్కంపు వెలదికిఁ ♦ దృప్తిని గలిగింప
భారతీపతికైన ♦ వశముగాదు
విత్తమెంతిచ్చిన ♦ వేశ్యకునిజమైన
వలపును గలిగింప ♦ వశముగాదు
వారాంగనా పాశ ♦ బద్ధుఁడైన విముక్తి
నంద నెవ్వనికి శ ♦ క్యంబుగాదు
ధనకామినీమణి ♦ ఘనమోహశరముఁల
దప్పించు కొనుటకు ♦ దరముగాదు

తే. గీ. ఇప్పుడైన దెలివిబూని ♦ యెన్నడికను
వేశ్యకడకేగమని యొట్టుఁ ♦ బెట్టుకొనుఁడు
దాని సంపర్కమెప్పుడు ♦ దలపవలదు
స్వానుభవమిది చెప్పుచు ♦ న్నాను వినుఁడు.

(నిష్క్రమించును.)

సుబ్బి—యెనకా ముందు సూడకుండ బోగంవోళ్ళదగ్గిరకెల్లే సవట
    పీనుగుల్లాలా యినండి.

సీ॥ తైతెక్కలాడంగ ♦ తబ్బిబ్బు సెందుచు
    యేశ్యయింటికి పరు ♦ గెత్తినాను
సెయిమైన తగిలితె ♦ సేనని తలపోసి
    సేరిదానికి సేవ ♦ సేసినాను
సిరునవ్వు నవ్వితే ♦ సిత్తమందుబ్బుచు
    ముదవంది పాదాలు ♦ మొక్కినాను
యెలదిమాటలు సూచి ♦ యెట్టోడినై ప్రేమ
    కలదంచు నెంతయో ♦ తలసినాను
తే. గీ. సేతిలో ముష్టి సెంబోటి ♦ సేరుదాక
    యింటిసుట్టును కుక్కలా ♦ గెల్లినాను
    యేశ్యలింటికి మీారెప్పు ♦ డెల్లవద్దు
    యెల్లితే కొంపకూల్తుంది ♦ యినుఁడు యినుఁడు.

సీ. మీాదసెయ్యేస్తైనే ♦ మేలన్ని, యెన్నెన్నొ
    కాసులు మీాద పా ♦ రేసినాను
యింటిలోపల కార్య ♦ వంటేను వలసిన
    యెచ్చాల కెచ్చాలు ♦ యిచ్చినాను
సంతోసమందుటే ♦ సాలని సరదాకి
    పదిసార్లు పాదాలు ♦ పట్టినాను
నీమీాద మోజుంటె ♦ నిజమని నమ్మిచు
    యెట్టోడిలాగున ♦ యెళ్ళినాను
తే. గీ. యెంతయిచ్చిన తుదకిట్లు ♦ యెల్లగొట్టి
    నారు; ప్రేమయుండదు యేశ్య ♦ నారులకును

వేశ్యయింటికి మీరెప్పు ♦ డెల్లపద్దు
వెళ్లితే కొంపకూల్తుంది ♦ యినుఁడు యినుఁడు.
(నిష్క్రమించును.)

చింతా—(ప్రవేశించి) చేయవలసిన పనులన్నియుఁ జేసినాను. (ఇంచుక నడచి)

సీ. పడుపువృత్తినిబూని ♦ కడుపునింపుకొనుచుఁ
గాలంబుఁబుచ్చెడి ♦ గరితలార
సతులతోనుండెడి ♦ పతులను నెడఁబాపి
పాపంబునార్జించు ♦ పడఁతులార
విత్తమేవిభునిగాఁ ♦ జిత్తమందున నెంచి
కుక్కలైచరియించు ♦ కుమతులార
అతినీచచిత్తలై ♦ ప్రతిపూరుషునకును
కొంగుపఱచుచుండు ♦ కుమతులార

తే. గీ. పడుపుజీవనం బిల ఘోర ♦ పాపభరిత
మనెడిమాటను దలపోసి ♦ యిట్టివృత్తి
మాని; పరమేశునమ్మి స ♦ న్మార్గపథము
ననుసరింపుఁడు మీరు వే ♦ శ్యసతులార.

(తెరలో)

శ్లో॥ చింతామణిర్జయతు సోమగిరి ర్గురుర్మే
శిక్షాగురుశ్చ భగవాన్ శిఖింఛపింఛమౌళిః
యత్పాద కల్పతరు పల్లవ శేఖ రేషు
లీలా స్వయంవర రసంలభతే జయశ్రీః.

చింతా—ఆహా! ఏమి కర్ణామృతము.

బిల్వ—(పైశ్లోకమును చదువుచు ప్రవేశించును.)

చింతా—ఆహా! ఏమి! శుకుని చందమున వెలుంగుచున్న యీమూర్తి
వైభవము!

బిల్వ—కృష్ణా!

శ్లో. ఫుల్లేందీవర కాంతి మిందువదనం ♦ బర్హావతంసప్రియం
శ్రీవత్సాంక ముదార కౌస్తుభధరం ♦ పీతాంబరం సుందరం
గోపీనాం నయనోత్పలార్చితతనుం ♦ గోగోప సంఘావృతం
గోవిందం కలవేణునాద నిరతం ♦ దివ్యాంగ భూషం భజే.

శ్లో. పల్లవారుణపాణిపంకజ సఙ్గివేణు రవాకులం
ఫుల్లపాటలపాటలీ పరివాది పాద సరోరుహం
ఉల్లసన్మధురాధరద్యుతి మంజరీ సరసాననం
వల్లవీకుచ కుంభకుంకుమ పంకిలం ప్రభుమాశ్రయే.

చింతా—(తనలో) ఈమహానుభావునకు శ్రీకృష్ణ భగవానుండెంతలో
సాక్షాత్కరించినాఁడు? (సమీపించి) యోగీంద్రా! తామిప్పు
డెక్కడికి దయసేయుచున్నారు?

బిల్వ—నీ వెవరవు?

చింతా—మీ సేవకురాలను.

బిల్వ—ఓహో! నీవు నన్నుద్ధరించిన మాతృదేవతవు.

"చింతా"—(అనుశ్లోకమును జదువును.)

చింతా—మహాత్మా! మీరిప్పు డెచ్చటికిబోవుదురు?

బిల్వ—నాభార్యకును, తండ్రికిని, సంస్కారవిధులు రాహుశాస్త్రిచే

జేయించితివి. నేనిప్పుడు బృందావనమునకుఁ బోవుచుంటిని. తల్లీ! ఇఁక నేనేమైన సేయవలసిన కార్యమున్న నానతిమ్ము.

చింతా—దేవా! ఇంకేమియును లేదు. ఇట్లుమాత్రి మాశీర్వదింపుఁడు.

సీ. పాపభూయిష్ఠమై ♦ పణ్యాంగనల్ సేయు
వ్యభిచార జీవన ♦ మణఁగుఁగాక
ధనము నార్జింపంగ ♦ ధనకామినీమణుల్
పురుషులఁ జేర్పక ♦ పోల్తురిగాక
పురుషులెవ్వరు తమ ♦ తరుణులవిడిచిదు
ర్వృత్తి బూనకయ జీ ♦ వింతురిగాక
పరమసాధ్వీమణుల్ ♦ పతులతోఁగూడి సౌ
ఖ్యంబుల నెప్పుడు ♦ గాంతురిగాక

తే. గీ. పరమపావనమైన యీ ♦ భరతభూమి
యందు మచ్చయైయున్న వే ♦ శ్యాన్వయంబు
నందు మార్పుజెంది పరిణ ♦ యంబులగుచు
నుండి వెలలేని కీర్తిని ♦ నొందుగాక!

(తెర వ్రాలును)

సప్తమాంకము

సంపూర్ణము.